# విషయసూచిక



---

## చందాదారుల కొరకు విన్నపము

'ఆంధ్రమహిళ'— పోషకవర్గానికి చెందిన చందాదారులు మేమెన్నిజాబులు వ్రాసినా, తాము చెల్లింపవలసిన చందాలు చెల్లింపకుండటమేకాక, జవాబులయినా వ్రాయకపోవటం విచారకరం. అట్టిమహిళయులు ఎప్పటిమోస్తరుగా మహిళకు తమచందాలను వెంటనేపంపి పోషింపవలెనని అభ్యర్థిస్తున్నాము.

## రచయితలకు మనవి.

'ఆంధ్రమహిళ'—కు ప్రచురణార్థం వ్యాసాలుపంపే రచయితలు, అరఠావు కాగితాలలో— విడివిడిగ్గాచక్కనివ్రాతతో ఒక్క ప్రక్కమాత్రమే వ్రాసిపంపాలి. చేతికివచ్చినట్లు జిలుగువ్రాతతో పంపే వ్యాసాలు అంగీకరింపబడవు. పంపిన వ్యాసాలు తిరిగి వాపసుపంపబడవు. కాన రచయితలు ఒక ప్రతి ముందుగానే వ్రాసి భద్రపఱుచుకోవటం మంచిది.

ఇట్లు:— మేనేజరు.
ఆంధ్రమహిళ.




వ్యవస్థాపకురాలు : దుర్గాబాయి దేశ్‌ముఖ్

సంపుటి 17 :: మే. 1961 :: సంచిక 5

# సంఘ సంక్షేమ కార్య నిర్వాహకులు: వారి కర్తవ్యాలు

సాధారణంగా సంఘ సంక్షేమ కార్యాలకు తమ జీవితాలనే అంకితంచేసే స్వచ్ఛంద సేవికా సేవకులకు—నిస్స్వార్థం, ఆత్మవిశ్వాసం, కార్యదీక్ష, కష్టసహనం, నిరాడంబరం, నిత్యసంతుష్టి, పరోపకారచింత, సానుభూతి, ఉత్సాహం— ఈలాటి గుణాలు అత్యంతావసరం. ఇట్టివారు పట్టుదలతో తమ విధ్యుక్త ధర్మాలను నెఱవేర్చటానికి తగిన పథకాలు నిర్మించుకొని కార్యరంగంలోకి దిగి ఒక కార్యక్రమాన్ని అనుసరించి పనులు సాగించే యెడల, ఆ యా ప్రాంతాల్లోని ప్రజలు తప్పక సహకరించటమే కాక ఆర్థికోపపత్తులు కూడ తమంత లభించే యేర్పాటులు చేస్తారు. ఆమీద ప్రభుత్వసహాయం పొందటానికి సంక్షేమకార్య నిర్వాహకులు ఏకోన్ముఖంగా ఒత్తిడి తెచ్చే అవకాశం తటస్థిస్తుంది. దీనికి గ్రామసేవికాసేవకుల నిరంతరకృషి పునాది కావాలి. సంఘసంక్షేమకార్యకారులకు నగరాల్లోకంటె గ్రామాల్లోనే యెక్కువగా ప్రజల సహకారం లభిస్తుంది. అయితే, వారికి సంక్షేమసంఘకార్యక్రమాలను గూర్చి మనస్సుకెక్కేటట్లు నచ్చజెప్పాలి. ఇందులకై సంఘ సేవకులు పలుమారు గ్రామపరిసరాలకు వెళ్లాలి. చుట్టుపట్ల పదిమైళ్లలోపున గల గ్రామాలలో వసించే పలుకుబడిగల మోతుబరులనుచూచి, సంక్షేమసంఘ కేంద్ర స్థాపనావశ్యకతను తెలిపి, అట్టిది నెలకొల్పటానికి ప్రోత్సహించాలి. ఆపదిమైళ్లలోపున తక్కిన సమీపగ్రామాలకన్నిటికి అందుబాటులో అన్నివసతులతో అనుకూలంగా ఉండేగ్రామాన్ని కేంద్రంగా నిర్ణయించుకొని, ఆప్రాంతాలవారికి అలవాటయిన కుటీరపరిశ్రమల్లో తరిబీతు నివ్వాలి. సులభమయిన చేతిపనులలో (వారదివరకు అభ్యాసపడనివాటిలో) వారికి అభిరుచి కలిగించాలి. విద్యాగంధం ఏమాత్రం లేనివాళ్లకి వయోజనవిద్య నేర్పటానికి తగినయేర్పాట్లు చెయ్యాలి. ఆలాచేయటంలో ఆగ్రామాల్లోని ధనవంతులు స్వచ్ఛందంగానే ఆర్థికంగా తోడ్పడగలరు. తదుపరి ప్రభుత్వసహాయంకూడా తప్పక తనంత లభించి తీరుతుంది.

ప్రకృతం ఈమహత్తర మానవసేవకు తమజీవితాన్ని అర్పించు త్యాగబుద్ధిగల సంఘసేవకులు చాలవరకు తక్కువ అనేచెప్పాలి. విదేశాలలో స్వచ్ఛందంగా ఇలాటి సేవకు పరమోత్సాహ[illegible] చాలమంది ముందంజ వేయటంవల్లనే—ఆదేశాలు అన్నిరంగాల్లోను అభివృద్ధిచెంది శాంతి

సుఖసౌభాగ్యాలతో కళకళలాడుతున్నాయి. అందును వారిలో మహిళామణులే తమ జాతి సంక్షేమకార్యకలాపాల్లో పాల్గొనడం ముదావహం.

అయితే, యీసందర్భంలో మనవారు ముందుకు రాకపోవటానికి కారణం కొంతవరకు ఆర్థిక దౌర్బల్యమే–అని చెప్పాలి. పైగా ఇట్టిజాత్యభ్యుదయ కార్యాలకు పూనుకొనేవారికి ప్రభుత్వంవల్ల తగినంత ప్రోత్సాహం లేకపోవడంకూడా ఒకహేతువే. కాని తదేకదీక్షతో సంఘసంక్షేమకార్యాలను నెరవేర్చే కేంద్రాలేర్పడి గృహపరిశ్రమా విద్యారోగ్యాది నానారంగాలలోను, మనోవికాసానికి మూలకారణాలయిన చిత్రలేఖన, శిల్ప, నాట్య, సంగీతాది లలితకళాభివృద్ధిలోను చొరవ చూపే పల్లెపట్లు ఆదర్శగ్రామాలుగా తయారయినపుడు– ఒక్క ప్రభుత్వదృష్టే కాకుండా తక్కిన ప్రదేశవాసులదృష్టిని గూడ అవి ఆకర్షింపగలవు.

మన ఐక్యభారతప్రభుత్వం పంచవర్ష ప్రణాళికల ననుసరించి పెద్దయెత్తున దేశంలో పెక్కు ప్రాజెక్టులకు పథకాలు తయారుచేసికొని తదనుసారం ఎన్నివిధాల ప్రజాసౌకర్యార్థం, దేశక్షేమార్థం పాటుపడినా, వాటికన్నిటికీ దోహదం ఇచ్చేవి గ్రామాలనే విషయం విస్మరించరాదు. కాన వాటిని సర్వతోముఖంగా ముందుకు తీసుకురావటానికి సంఘసంక్షేమకేంద్రాల కార్యాలు నెరవేర్చ పూనుకొన్నవారికి అన్నివిధాల ప్రోద్బలం ప్రోత్సాహం కలిగించటం తమవిధిగా భావించాలి. ప్రజలు కూడా, సంక్షేమకార్యకర్తల కెంతైనా తోడ్పడటం అత్యంతావసరం.

## కన్యలకు వివాహయోగ్య వయస్సు

ఐక్యజాతీయ ప్రాతినిధ్యంవహించిన 18 మంది సభ్యులుగల సంఘం జినీవాలో ఇటీవల సమావేశం అయి, సాధారణంగా కన్నెలకు వారి వారి పరిస్థితులను అనుసరించి 15సం॥రములు వివాహార్హప్రాయంగా అన్నిజాతులు అంగీకరించాల్నని తీర్మానించినట్లు మార్చి 29తేది వెలువడిన రూటరువార్త.

ఇది కొంతవఱకు సర్వసమ్మతమే అయినా, ఆయీడులో ఉన్న అబల లోకజ్ఞానంకలిగి స్వానుభవపూర్వకంగా సంసారనౌకను నడుపగలదనేది విచారణీయాంశం. అయితే ముక్కుపచ్చలారని కన్యలను జ్ఞానవికాసంలేని పశుప్రాయులయిన వరులకు ముడిపెట్టజూచే పూర్వాచారపరాయణులకు ఇది ఒకవిధంగా ప్రతిబంధకం అవుతుంది. లోగడ హరబిలాసు శారదా బిల్లులో పదునాలుగేండ్లు ఆడుపిల్లలకు పెండ్లాడవలసిన ప్రాయంగా నిర్ణయించినపుడే, మనదేశంలో అలజల్లు రేగినాయి. కాని కాలంగడచేకొద్దీ—ఆవయస్సు క్రమేణా పెరిగి, ప్రకృతం 20–25 ఏండ్ల యీడుగల కన్యలకు కూడా పరిణయసంబంధాలు దూరమయినాయి. బ్రహ్మచారిణులసంఖ్యకూడా వృద్ధిఅయింది.

ఇందులో మరొకవిశేషం కూడా. ఎదిగిన కన్యలు త్వరితంగా పెద్దవారయ్యేకొద్దీ తగినవరులు లభించటం దుర్లభం అవుతున్నది. దానికితోడు ఏబదేండ్ల పురుషుడైనా, పడుచుపెండ్లాన్నే(అనగా 16–20 మధ్యవయస్సు గలదాన్నే) కోరుతాడు. కాని, ముదిరిన భార్య అతనికండ్లకు ముసలిది– (తానేమో పడుచువాడయినట్లు). పైగా, ఈకాలాన్ని అనుసరించి పెండ్లికి ముందుగా పరస్పరం చూచుకొని ఒండొరులు ఇష్టపడాలి.

పై విషయాలను పరామర్శించామంటే, జనీవా సభాసభ్యుల తీర్మానమే అందరకీ అంగీకార్యమవుతుంది. కాని, అందులోనూ- లోపాలు చాలా వున్నాయి. బాల్యంగడచి యౌవనంపొటమరించటం సాధారణంగా ఆడుపిల్లలకి- 14,15ఏండ్లప్పుడే ప్రారంభం అవుతుంది. అప్పుడామెను పరిణయమాడే వరుడు— వెంటనే ఆమెను సంసారగర్తంలోకి దింపుతాడు. బాల్యయౌవనదశల మధ్య ఊగిసలాడే ఆకన్య- ముందువెనుకలు తెలియని భర్తయింటి వాడుకలకు, ఆచారాలకు పనుపడడానికి కొంతకాలం పడుతుంది. విద్యావంతులు, నాగరకులు, వివేచనాపరులు అయిన పురుషులయితే భార్యలను దారికి తెచ్చుకుంటారు. ఆమె కార్యాలకు సహాయపడతారు. కాని, మోటు మానిసులు- అందును భార్యఅంటే బానిసగా భావించే అనాగరకులు— నిరంతరతామసస్వభావులు, విద్యాగంధంలేని పెద్దమ్మలు, లోకజ్ఞానశూన్యులు, భార్యలకు నానాయాతనలు కలిగిస్తారు.

కాన, 15ఏండ్లప్పుడు పెండ్లాడే సందర్భంలో ఆమె విద్యార్థినిగా ఉంటే, ఆమె చదువుతున్న విద్యకు భర్త భంగం కలిగించకూడదు. విద్య, యేకొంచెమయినా- నేర్చిన వివాహిత తన సంసారాన్ని ఒడుదుడుకులులేకుండా నిర్వహించుకొంటూ— సమిష్టికుటుంబంలోని తక్కిన తనవారికందరికి నోట్లో నాలుకగా మెలగగలదు.

మొత్తానికి జనీవాకూటమిలోని సభ్యులు సూచించిన కనీసపు వివాహయోగ్య వయసు 18-ఏండ్లవరకు పెంచడంయుక్తం. ఇంతకూ అది చట్టబద్ధం కావాలి. పురుషుల జనాభాసంఖ్యకంటె స్త్రీజనాభాసంఖ్య తక్కువగా కనిపించే మనదేశంలో బ్రహ్మచారిణులుగా కొంతమంది ఉండటంవల్లను, బాలవితంతువుల పునర్వివాహాల నిషేధంవల్లను, వివాహార్హ యువతులకు మరికొంత లోటు ఏర్పడుతున్నది. అట్టిలోటు లేకుండ చేయటానికి కావలసిన మార్గాలు అన్వేషించవలసిన బాధ్యత ప్రజలమీదను ప్రభుత్వంమీదను ఎంతయినా, ఆధారపడివున్నది.

---

## భగవన్నుతి

స్వామీ! నిన్నెడఁ బాసి దుష్కృతమతిన్, బల్వోకలంబోయి, నీ
నామం, బొక్క నిమేషమేన్ సలుప ధ్యానంబునన్, మదిన్, నన్, శఠున్
వ్యామోహాత్ముఁ బరప్రతారణచణున్, స్వార్థప్రియుం గష్టునిం,
బ్రేమండాసి, భయంబువాపి,కరుణన్ వీక్షింపు, పద్మాధిపా! ॥

పరులకు జాపలెత్తుపని, పైబడినన్, వెనుకాడకుండ, దు
ర్భరమని యెంచకుండ. సలుపందొరకొంటిని, బ్రాయమందు. ది
క్కఱి ముదివగ్గనై యిపుడు నాత్మతనూబలమీఁగి క్రుఁగ,నె
వ్వరు ననుగాతుర న్దిగులు స్వాంతమునం జెలరేగె,శ్రీపతీ! ॥

దగ్గఱఁజేరు వారికి వెతల్దొలగించెడు పుణ్యకాలమె
ట్లొగ్గునొ?, యట్టిస్వర్ణయుగ మొక్కొకసారియె తోఁచు జీవికిం,
బగ్గముపాడుగా మిగతమన్గడద్రోయవలెన్, ధనాఢ్యుఁడై
మ్రొగ్గిన నాటిచుట్టములు మోమటుత్రిప్పరు, స్రగ్గుచోఁ బ్రభూ ॥

—కౌశిక.

వాస్తవిక గేయకథానిక :

# దుప్పటి దొంగ

## రచన: భైరవభొట్ల వేం. రామబ్రహ్మశ్రీ

గడగడావడకించు చలిలో
కడుపుమంట దహించుచుండగ
భిక్షకొరకై యొక్క ముసలిది
వీధిలో నడచెన్. ౧

అర్తనాదము లాలకించెను
కీర్తివంతు డొకండు దయతో
దీన వదనముతో తపించెడు
మానినిని జూచెన్ ! ౨

కటకటా! దుర్భరపు చలిలో
కొంత గజగజ వణకుచుండెను
గజము గుడ్డయు లేదు పాపము
కట్ట నీమెపయిన్ ౩

దివ్య భారతనారికయ్యో! ఇ
దెట్టి దుర్గతి హరిహరీ! యని
మేడ కిటికీనుండి దుప్పటి
మీదికిని విసరెన్. ౪

కడుపుచిచ్చెటులైనగానీ
కటికచలి యిక పోవునంచును
కొంత దుప్పటి కప్పుకొని యొ
క్కింత నడచె నటన్. ౫

వీధిచివరకు చనెనొ లేదో!
వింత గొలిపెడు వేసములతో
కేసుదొరకక దిగులుపడు "పో
లీసు" కనుపించెన్ ౬

బిచ్చకత్తియ దుప్పటిని గని
మెచ్చుకొనె తన అదృష్టరేఖను
మంచి దొంగతనమ్ము కేసును
గాంచితిని, సెహబాస్, ౭

అనుచు సంతసమంది పోలీసు
ఆమెను, ఆగుము, పోకు , మంచును
ఆమెదుప్పటి పట్టిలాగుచు
అరిగె కోర్టునకై ౮

"ఈమె కేడది ఊలుదుప్పటి
ఈమె జూడగ బిచ్చకత్తియ
ఎక్కడో పొంచుండి చోరి
ఈమె యొనరించెన్.॥ ౯

విన్నవింపగ నిట్లు కోర్టున
ఉన్నజడ్జీ లెల్ల సాక్షుల
పిల్చి దీర్ఘవిచారణమ్మును
పేర్మి చేయంగన్ ౧౦

ఎట్టి దొంగతనమ్ము గానీ
ఈమె చేయదు, తిరిగి దుప్పటి
ఈమె కిమ్మని! తీర్పుచెప్పిరి
ఏకకంఠముతో— ౧౧

ఆమెదుప్పటి ముట్టుకొనకి
ట్లనెను పాపపు సొమ్ము వద్దిది
దుష్ట మానవ దృష్టిలో బడి
దుష్టమిది యాయెన్- ౧౨

కంబళీ లేకున్న పోనీ
కష్టములు వచ్చినను రానీ
మంచిపేరున బ్రతుకనీయరు
ఎంచ నీదుష్టుల్ ! ౧౩

దొంగ యని నను విచారించగ
దొరలె! వీరలు బీదతనమున
ఇట్టినింద భరింపలేనని
ఇంతి విలపించెన్. ౧౪

ఆకసమ్మున నొక్కసారిగ
అలము కొనియెను మేఘజాలము
ఆమెలో శ్రుతి గల్పి అశ్రువు
లవియు వర్షించెన్. ౧౫

# పాపం పార్వతి

## సారథి

ఆరోజు వుదయం మాజిస్ట్రేటు జగన్నాథం అదో లాగ వున్నారు. ఎందుకో ముఖంలో కొంచెం నిరుత్సాహం కన్పిస్తుంది. ఆరోజు బోనులో నిలబడ్డ ఖైదీ వంక ఒక్కసారి తేరిపార చూచారు. వెంటనే ఎలక్ట్రిక్ షాక్ తిన్నవారిలా గుడ్లప్పగించి చూడనారంభించారు. మనస్సు పరిపరి విధాలా పరితపింపసాగింది. ఏమిటీ బోనులో నిలబడ్డ ఆ ఖైదీవంక చూస్తుంటే తనకి మళ్ళీ పార్వతి జ్ఞాపకం వస్తున్నది. ఒకవేళ నిజంగా ఈ ఖైదీ నా పార్వతేనా ? అయితే అయిదు సంవత్సరాలకు ముందు పారిపోయిన పార్వతి ఈ రోజు హటాత్తుగా ఈ రూపంలో సాక్షాత్కరించిందేమిటి? ఒకవేళ పిచ్చేమైనా పట్టిందా, అని అనుకుంటున్నంతలో కోర్టులో సందడి ప్రారంభమయింది.

కేసు ప్రారంభమయింది. ప్రాసిక్యూషన్ కథప్రకారం ఈ ముద్దాయి ఆవూరిలోకెల్ల పలుకుబడిగల వ్యక్తులలో ఒకరైనటువంటి సుదర్శనాన్ని హటాత్తుగా దుడ్డుకర్రతో బాదినందువల్ల అతనితల పగిలి ప్రాణావస్థలో అస్పత్రిలో చేర్చారట. అతను బ్రతకటం కల్ల అని డాక్టర్లు పెదవి విరిచేసారు. ఆ దయామయుడు ఆదరిస్తే తప్ప ఈపాటికి అతను ఇహలోక బాంధవ్యాలన్నిటిని తెంచుకునివుండాలి. విచారణ ప్రారంభమయింది. ఆమె తరపు వాదించడానికి ఎవ్వరులేరు. ఆమెకూడ ఏం పలకడంలేదు. ఎవరికి ఏం తోచడంలేదు. కేసును మళ్ళీ నాలుగు రోజులకు వాయిదావేసి మాజిస్ట్రేటు జగన్నాథం లేచారు.

ఆయనకు "పుండుపై కారం చల్లినట్లు" అతనిని వుదయంనుండి పీడిస్తున్నవ్యధ జాస్తి కాజొచ్చింది. ఆరోజు త్వరగా ఇంటికి బయల్దేరారు. దారిపొడుగునా పార్వతిని గురించి ఆలోచిస్తూ తన ఇంటిని దాటి పోవడం గుర్తించి వెంటనే తిరిగి లోన జొరబడ్డారు. రావడంతోనే అలాగే వసారాలో ఈజిచైరులో కూర్చొని అయిదు సంవత్సరాలకు ముందు జరిగిన ఆ సంఘటనని జ్ఞప్తికితెచ్చుకో ప్రయత్నించడంలో ఆయన పడ్తున్నబాధ నిజంగా ఆ పరిసరాలలో ఎవ్వరైనా చూస్తుంటే వాళ్ళు ఆ బాధలో లీనమైపోతారనడంలో ఏ మాత్రం సందేహంలేదు. ఇంతకీ ఆ జరిగిన సంఘటన తాలూకు వివరం ఇది—

"ఆనాడు శుక్రవారం. ఆయనకు వివాహమై ఆరోజుతో 16 సం॥ కావస్తుంది. అంతవరకు ఆ దంపతులిరువురికి సంతాన ప్రాప్తిలేదు. కలుగుతుందన్న నమ్మకంకూడ పోయింది. ఆ సాయంత్రం కోర్టునుండి వస్తూ (అప్పట్లో న్యాయవాదిగా వుండేవారు) ఒక జ్యోతిష్కుడిని వెంట బెట్టుకొచ్చారు. ఆ జ్యోతిష్కుడు సకలమేధా సంపన్నుడు కాబోలు, పార్వతి జాతకం చూడడంతోటే ఆమెకి అప్పటికే ఒక సంతానం తప్పక కలిగి యుండి వుండాలి. అన్న సందేహాన్ని చల్లగా చెప్పాడు. ఈ మాటలు వింటూనే పార్వతి ఏడుస్తూ లోపలికెళ్ళిపోయింది. జగన్నాథం ఏం మాట్లాడక అలాగే శూన్యంలోకి చూస్తూ ఆలోచిస్తూ కూర్చుండిపోయారు. ఈ విషయం ఎంతవరకు నిజమన్న విషయాన్ని గ్రహించాలని పార్వతిని పలుకరించారు. పార్వతి సమాధానం ఏమీ ఇవ్వక భోరున ఏడుస్తూ ఆతని పాదాలను చుట్టి పెనవేసుకుంది. మళ్ళీ ఆయన ఆలోచనానిమగ్నుడై పోయారు. అలా ఎంత సేపు ఆలోచిస్తూ కూర్చొన్నారేమో, కాని సంధ్యవేళ కావడంతో లేచి లోనికి దారితీశారు. ఇంట్లో ఏ సందడి లేకపోయింది. కనీసం దీపమైనా వెలిగించ బడలేదు. ఎందుకో శంకిస్తు పార్వతిని పిలిచారు, సమాధానం రాకపోవడంతో కంగారు పడిపోయి ఇల్లంతా వెదకటం ప్రారంభించారు. ఎక్కడ కనబడక పోవడంతో ఏదో తోచిన వారికిమల్లె వెంటనే పెరటికి దారితీసి నూతిలో చూచారు, ఏదైతే జరుగుతుందని ఆయన భయపడ్డారో అలాంటిదేది జరిగినట్లు అక్కడ సూచనలు కనబడక పోవడంతో కొద్దిగా ధైర్యంతెచ్చుకుని, మళ్ళీ లోనికి దారితీసి నాలుగుదిక్కుల పరకాయిస్తున్నారు.

ఆయనదృష్టి అమాంతం డ్రాయింగ్ రూంలో టేబిలుపైనున్న వుత్తరంపై పడింది. తనకేదైనా వుత్తర మొచ్చిందేమోనన్న ఆతురతతో చదివి ఆశ్చర్యంచెంది ఆలా శిలా ప్రతిమలా నిల్చుండి పోయారు

ఆ వుత్తరం పార్వతి వ్రాసింది. అందు ఇలావుంది.

ఆ జ్యోతిష్కుడు చెప్పినదంతా సత్యం. ఇన్ని రోజులు ఈ సత్యాన్ని మీ వద్దనుండి దాచాను. గనుక మీకు మళ్ళీ ఈ నా పాపిష్టి ముఖాన్ని చూపలేక వెళ్ళిపోతున్నా. దయచేసి మీరు నన్ను క్షమిస్తారని ఆశిస్తా"

ఆయనను అమాంతం ఎత్తి భగభగమని మండుతున్న మంటలో పారవేస్తున్నట్టు బాధపడి పోయారు. ఆ రోజుతో తనకి పార్వతికి ఋణం తీరిందని ఆయన నిశ్చయించుకున్నారు.

కానీ ఈ రోజు సంఘటనతో ఆయనలో దాగున్న బడబాగ్ని మళ్ళీ పెల్లుబికింది. ఆయన అంతవయస్సులోను తన వ్యధను అణచుకోలేకపోయి విలవిల ఏడిచినంత పనిచేశారు. ఆ నాలుగురోజులు ఆయన యమయాతన అనుభవించారు.

నాలుగోరోజు యథాప్రకారం ఆ కేసు మళ్ళీ ప్రారంభమయింది. ఆమె తరపు వాదించడానికి, అప్పుడే క్రొత్తగా ప్రాక్టీసు పెట్టిన శేఖరం సంసిద్ధుడై నాడనడంతోటే అందరు ఆశ్చర్యం చెంది, ముక్కుమీద వేలేసుకున్నారు. ఇంతకీ శేఖరం, ఆ గాయపడి ప్రాణావస్థలో నున్న సుదర్శనంవద్ద చిన్నప్పటినుండి పెరిగి కష్టాలకి నష్టాలకి ఆయనమీదే ఆధారపడియున్నటువంటి వ్యక్తి.

ఈ ముద్దాయి సుదర్శనాన్ని అంత దారుణంగా గాయపరచడానికి గల కారణాన్ని వివరంగా చెప్ప నారంభించింది.

"నా పేరు పార్వతి. అయిదు సంవత్సరాలకు ముందు కొన్ని కారణాలవల్ల నేకట్టుకున్న భర్తనువదలి వెళ్ళిపోవలసి వచ్చింది. నాకు 'నా' అన్నవారెవ్వరులేక పోవడంతో ఈ వూళ్ళో మిల్లుయజమాని రామనాధం గారింట్లో పనిచేయడానికి నియమితురాలై నాను. నిన్నటివరకు నా జీవితం సాఫీగా గడచి పోతూవచ్చినది. కాని నిన్న సాయంత్రం నా యజమాని కుమార్తె లతకు ఒక వుత్తరం వచ్చింది. అందు ఆమెను వూరికవతల మామిడితోపులో తన్ను కలుసుకోవలసిందిగా శేఖరం వ్రాసినట్లు వుండడంతో, లత వెంటనే వెళ్ళిపోయింది. నా కెందుకో అ వుత్తరం చూస్తున్నప్పుడు ఆ దస్తూరి నాకు పరిచయమైనదిగా కనబడినందువల్ల, నేనూ లతను వెంబడించాను. లత వూరికవతల ఆ పాడుబడ్డ గుడికి దగ్గరనున్న మామిడి తోపులో ప్రవేశించింది. కాని అక్కడ లతకొరకు కాచుకున్న వ్యక్తిని చూడడంతోనే నా నవనాడులు కృంగసాగింది. కారణం—ఆ దురాత్ముడు సుదర్శనం లతను వంచించాలని అక్కడ కాచుక్కూర్చున్నాడు. ఆ దుష్టుడు ఇలా ఎందరిని మాయచేసి తన వలలో వేసుకుని ప్రపంచాన్ని మోసంచేశాడో చెప్పటం కష్టం. దాదాపు 23 సం॥లకు ముందు నాకు అరచేతిలో స్వర్గం చూపిస్తానని కల్లబొల్లి మాటలుచెప్పి, నన్ను అన్యాయంచేసి, ఒక శిశువును ప్రసాదించి నిర్దాక్షిణ్యంగా వెళ్ళగొట్టాడు."

ఆమెకు మాటలు తడబడుతున్నాయి. నీరసించి పోయింది. అతికష్టంతో మళ్ళీ చెప్పనారంభించింది.

"నాకేర్పడిన గతి ఎక్కడ ఈ అమ్మాయి కేర్పడుతుందోనన్న భయంతో ఏంచేస్తున్నానన్నది తెలియక అమాంతం దుడ్డుకర్ర నెత్తి అతడితల బాదాను. వెంటనే పరుగెత్తుకొచ్చి పోలీసు శరణుజొచ్చాను. శేఖరం గురించికూడ ఒక సత్యాన్ని నేనిప్పుడు కోర్టువారికి చెప్పాలి. ఈ రోజు శేఖరం నాకొరకు వాదించడానికి సిద్ధుడై యున్నాడంటే, అందుకు కారణం అతను ప్రేమించినటువంటి లతను నేను ఆ భయంకర దౌర్జన్యంనుండి కాపాడడమే అయి వుంటుంది. ఇంతకంటే ఒక ముఖ్య విషయాన్ని శేఖరం ఇప్పుడు గ్రహించాలి. శేఖరం నిజంగా నా కుమారుడు. అతను ఆ దుష్టుడు సుదర్శన మిచ్చిన వరప్రసాదం. శేఖరం పుట్టినవెంటనే నా మేనమామ తీసికెళ్ళిపోయి పెంచి అయిదు సం॥ల వాడుగా వున్నప్పుడు ఈ సుదర్శనానికి సంతానం ఏమీ లేకపోవడంవల్ల అతనివద్ద గారాబంగా పెరగనిచ్చాడు. తన పెంపుడు తండ్రి తన తండ్రని, అతను ఇంతటి గోముఖవ్యాఘ్రమని ఇంతవరకు శేఖరానికి తెలియక పోవచ్చు. ఇప్పట్లో ఇంతకంటే నేనేమి చెప్పలేకపోతున్నా" అని అంటూ ఆమె శోషిల్లి పడిపోయింది.

కోర్టంతా కంగారు పడిపోయింది. ఆమెను లోనికి చేర్చి డాక్టరుకు కబురంపారు. ఇంతలో ఆస్పత్రిలో నుండి వచ్చిన వార్తలనుబట్టి సుదర్శనం చనిపోయాడని తెలిసొచ్చింది.

ఇక్కడ ఈమె పరిస్థితి మరీ అధ్వాన్నంగా వుంది. అందరికంటే బాగా బాధింపబడ్డవారు జగన్నాధం. ఆయన ఆమె మంచందగ్గర కూర్చొని పార్వతి కళ్ళు తెరుస్తుందని ఆశతో చూస్తున్నారు.

డాక్టరువచ్చి పరీక్షచేసి ఇంజక్షనిచ్చి "ప్చ్" అని పెదవి విరిచిపోయాడు. తర్వాత ఇరవై నిమిషాలకు మెల్లిగా కళ్ళు తెరచిచూస్తూ ఆనందంతో, అతి కష్టం మీద జగన్నాధంగారిని గుర్తించి, అతని చేతిలో శేఖరాన్ని వుంచి బలవంతంగా కళ్ళు మూతపడ్డంటే, తానశక్తురాలై పోయింది. తర్వాత కొద్ది సేపటికి నాడే నిలిచి పోయిందని తేల్చేశారు.

శేఖరం అమాంతం "అమ్మా" అని భోరున ఏడ్చాడు. జగన్నాథంగారు అనురాగంతో అతని భుజాన్నితట్టి ఓదార్ప ప్రయత్నిస్తు ఆయనకూడా బాధపడ్తున్నారు.

# "సౌ భా గ్య వ తి"

## రచన : "యలమాటి"

ఆమెమంగళాకారవదనం, సువిశాలనేత్రాలు, పాలమీగడవంటి సున్నితమైనచెంపలు, అరుణారుణ కాంతిపుంజాలను వెదజల్లుతున్న మృదువైనఅధరాలు, తీర్చిదిద్దినట్లున్న చక్కనిముక్కు; మామిడిపండుమొనవలె చూడముచ్చటగానున్న చిరుగడ్డం; మేఘమాలికలవలె మెలితిరిగిన వుంగరాల వెండ్రుకల తల; కోటికోట్లదీపాలకాంతితో తళతళా మిలమిలా మెరుస్తూన్నశరీరకాంతి; మహాసముద్రంలో మంచుపలకలా స్వచ్ఛంగా వున్న విశాలఫాలభాగం; అందాన్ని, యవ్వనాన్ని సుస్పష్టంగా వ్యక్తపర్చేఅవయవసౌష్ఠవం తుంబురునారదాదుల వీణానాదాన్ని ధిక్కరించే కంఠస్వరం; ఆమెను లోకైకసుందరిగాను; భువనైకమూర్తిగాను చేసినవి.

ఆమె పదునెనిమిదేండ్లయువతి. యవ్వనమనెడి నదిసంద్రంలో ఆమెశరీరనావ నరాలవుధృతములనెడి అలలతాకిడికి వోలలాడుతోంది. జీవితంలో అంతకు పూర్వమెపుడు చవిచూడని మధురానుభూతులను చవిచూడాలని వాంఛిస్తోంది ఆమెమనసు. అంతర్గతంగా శరీరంలో కలుగు రక్తపుఆటుపోట్లకు ఆమె తట్టుకోలేక వుక్కిరిబిక్కిరి అయిపోతోంది.

....కాని ఆమెవితంతు వంటున్నారు యిరుగుపొరుగు ప్రజలు. ఆమెలో వితంతులక్షణాలు ఒక్కటైనను కన్పించవే! ఈనాడు లోకంఅంటే ఏమిటో అవలోకించే సమయం! కాని నేడామెకు తీరనివైధవ్యం! "అంతా విధివ్రాత!" అంటున్నారు కొందరు. ఆమె మధురాతిమధుర జీవితమంతా విషపూరితమయిందే! దుర్గంధభూయిష్టమయిందే! అంతా కాలవైపరీత్యమా? సంఘవైపరీత్యమా? నిజంగా ఆలోచిస్తే యిరువురిది అనిపిస్తోందికదా?

మూడవఏటనే మాతృవిహీనురాలైనప్పటికి, కన్నతండ్రిద్వార మాతృత్వపీయూషాల్ని గ్రోలుతు పదేళ్ళు వచ్చేవరకు నిక్షేపంలా పెరిగింది. మరుసటిసంవత్సరమే పదివేలు కట్నమిచ్చి ఆమెవివాహం యెంతోఘనంగా జరిపించాడు ఆమెతండ్రి వెంకటరత్నం. కాని ఆవరుడు ఏడవనాడే అకస్మాత్తుగా ఈలోకం విడచివెళ్ళిపోయాడు. శశికళ నుదుటికుంకుమ రాలిపోయింది. తల్లో పువ్వులు వాడిపోయాయి.

కాలచక్రం కటువుగా కదులుతోంది. గతాన్ని తలచుకొని; నేటికోర్కెలను ఆపుకోలేక ఆమె ప్రవాహం మధ్య తుంగమొక్కలా ఊగిసలాడుతోంది నేడు. అదేప్రవాహంలో సంఘదృష్టిలో అపసవ్యమగు మార్గానికి తనశరీరాన్ని వొంచిన, బ్రతుకే బరువైపోతుంది. అందులో తల్లిలేనిపిల్ల. తండ్రిచాటుబిడ్డ!.

కన్నకూతురు సుఖాన్ని కాంక్షించకుండ వెంకటరత్నం ధనసహాయంతో నిరాటంకంగ ద్వితీయవివాహం శాస్త్రోక్తంగా జరిపించుకున్నాడు. రెండేండ్లనుండి శశికళ సవతిపోరు భరిస్తోంది. నేటివరకు సవతితల్లిపై శశికళకు సదభిప్రాయం లేకపోలేదు. కాని యీనాడు శశికళ హృదయంలో తలిదండ్రులు కుంటువడిన జీవితరహదారిలో మైలురాళ్ళుగా నిలిచిపోయేరు. నేడు ఆమె అనుభవించేబాధ అట్టివారికే తెలియాలి.

వెంకటరత్నం. 'శశికళ'కు కన్నతండ్రిగ లోకందృష్టిలో చెలామణి అవుతాడనటంలో సందేహంలేదు. అతడు సుఖించడం ఆమె సర్వదా కాంక్షించవలసిన విషయమే! కాని ఆమెసుఖాన్నిగూర్చి ఒక్కక్షణమైన ఆలోచించాడా? ప్రకృతిధర్మాన్నే మరచిపోయాడే!

"ఏం! శశీ! సర్వవిధాల నిన్ను సుఖపెట్టడమే నాజీవితాశయం. నీవేమంటావ్?" అన్నాడు రాంబాబు చిలిపిగా చెక్కిలిపై చిటికవేసి.

"నేను కాదన్నానా? మరి మానాన్న........" అంది బెదురుతో ఆమె.

రాంబాబు పుష్కలసంపన్నుడు. కండలు బారిన అవయవసౌష్టం గలవాడు. మన్మథాకారుడు. వెంకటరత్నంగారి ప్రక్కయింటిలో అద్దెకు వుంటూ జియాలజీ బియస్సి చదువుచున్నాడు. ఒకనాడు ప్రయత్నంగా యిరువురిచూపులు కలిశాయి. నాటినుండి వారు కన్నెపిల్ల చల్లనిచూపులా వెల్లివిరిసిన మల్లెల వెన్నెలలోను; ఆనందడోలికల్లో ఊగుతుండె అందాలభామ చంచలనేత్రాలవలె తళతళ మెరుస్తున్న నక్షత్రాలక్రింద ప్రేమపీయూషాన్ని గ్రోలుతూ విహరించుట పరిపాటయిపోయింది.

ఇప్పుడామె మూడుమాసాల మాతృమూర్తి. సవతితల్లి చూడకుండ రోజు అతనుండే గదులూడ్చిసామాను సర్దటం ఆమెకు సరదా! ఒకతాళంచెవి యెప్పుడూఆమెదే!

సవతితల్లి స్వరాజ్యం అవులిస్తే ప్రేగులు లెక్కపెట్టే రకం. శశి గర్భవతని పసికట్టింది! "చెట్టంత కూతుర్ని

ఇంట్లోపెట్టుకొని ఆమె ప్రక్కనే తను విలాసజీవితాన్ని గడుపుటకు యిక బాధపడ నక్కరలేదు." అనుకొని స్వరాజ్యం నెమ్మదిగా భర్తచెవిలో పూదింది.

వెంకటరత్నం నత్తివాడైనప్పటికి తలలు మార్చగల మహామేధావి. సాధారణంగా మేధావుల తలలు స్వల్ప విషయాలలో పనిచెయ్యవు. శశికళ గర్భం ధరించిందని వినడంతో అతని శరీరం మ్రాన్పై పోయింది. చన్నీళ్ళ చలవవల్ల తేరుకొని వంటింట్లోకి వెడుతున్న శశిని చూసి "శశీ! మీఅమ్మ అన్నమాట నిజమేనా?" అన్నాడు.

ఏవిషయం నాన్నా" అంది శశి తెల్లబోయి.

ఛీ"! ఛీ!! యింకా ఏవిషయమంటున్నావా? యీసంఘంలో తలెత్తుకు నన్ను యెలా తిరగమన్నావు? ఫో! బయటకు. నీముఖం చూస్తేనే పాపం" అన్నాడు రౌద్రాకారంతో. శశికళ గజగజ వణకిపోయింది.

స్వరాజ్యమిచ్చిన కాఫీ త్రాగి నిదానంగా ఆలోచించాడు· వెంకటరత్నం. తన తొందరపాటుకు తనే సిగ్గుపడ్డాడు నిజాన్కి ఇందులో శశి తప్పేముంది? ప్రకృతి ఆమెనలా లాగింది. అంతేకదా? ఒకేవక్తి సహవాసాన్ని సహకారాన్ని యావజ్జీవితం కోరింది. అంతేకదా? అదే వివాహోద్దేశ్యంకదా?

"శశీ! శశీ!!" అనిఆనందంతో పిలిచాడు వెంకటరత్నం. శశి బిక్కుబిక్కుమంటు సింహంయెదుట పడే మేకపిల్లలా మెల్లగా వచ్చింది. "విచారించకమ్మా! మీవివాహం అతిత్వరలో జరిపిస్తా! ఆ రాంబాబును ఒకసారి సాయంకాలం మనయింటికి రమ్మని చెప్పు" అని వీధిలో కెళ్ళిపోయేడు.

ఓశుభదినాన కడువైభవంగా శశికళ; రాంబాబుల వివాహం జరిగింది. శశికళ సౌభాగ్యవతి అయింది.

---

గేయమాలిక :

# వృథా! వృథా!

రచన: శ్రీ భైరవభొట్ల వేం - రామబ్రహ్మశ్రీ

విశాలకేళికాస్థలి
వినోదమందిరాలలో
విలాసహాసభాసివై
విహారమేల చేతువోయి!

మహా క్షుధర్తి బాధతో
దహించిపోవు వీరలన్
విలోకనమ్ము జేయవా?
విలాపముల్ రచింపవా?

పదేపదేశుకా! పికా!
బకా! యటంచు పాడుతావ్!
మరేమి! నీవు భూమిపై
కనంగలేదటోయి! కవీ!

ప్రపంచమందు రోదనా
విపంచి గుండె ఝల్లనన్
నిరంతరమ్ము పాడగా
వినంగ లేదటోయి! కవీ!

కృశించి బక్కప్రేగులై
నశించువార లెందరో!
నిరాశతో అహర్నిశల్
తపించువార లెందరో!

సముద్రమందు వానలా
వృధాలె! వారిరోదనల్
రచింప లేనివారిపై
వృధాలు నీప్రబంధముల్

ప్రశాంత మోద సౌఖ్యముల్
స్పృశించనట్టి జీవులన్
గుణించి చెప్పకున్నచో
వృథా! వృథా! కృతుల్ వృథా!

# వేశ్యాంగనల సమావేశం

భారతదేశంలోని పెక్కుప్రదేశాలనుండి నృత్యగానకళా ప్రవీణలయిన వేశ్యలు తమకు సంబంధించిన అనేక సమస్యలనుగూర్చి చర్చించి వాటిని చక్కదిద్దుకొనే వుద్దేశంతో న్యూఢిల్లీలో (8.4.61) శనివారంనాడు సమావేశమయినారు. విస్పష్టంగా తమస్థితిగతులనుగూర్చి మనసు విప్పి ప్రకటించటానికి వారలామోస్తరు మొట్టమొదటిసారిగా ఒకచోట చేరటం శుభసూచకం.

రెండురోజులకు సభాకార్యక్రమాల్ని నిర్ణయించుకొన్నారు. అందులో ఈక్రిందిఅంశాలు చాలాముఖ్యమైనవి. (1) స్త్రీలలోను, కన్యలలోను చట్టప్రకారం అవినీతివృత్తిని అణచివేయటానికై గుణదోషవిచారణతో కూడిన ఆలోచనతో నిగ్గుతేల్చటం. కళాసంబంధమయిన అంతస్తును పెంచటానికై తగినశిక్షణను ఇచ్చేకార్యక్రమసూత్రాలను ఏర్పరచటం. (3) తమవృత్తులు కొనసాగించటానికి ఇష్టంలేనివారికి, వాటికి బదులు ఉద్యోగాలు లభించే ప్రణాలికను ఒకదాన్ని తయారుచేయటం (4) వారి పిల్లలకు కావలసినన్ని బాలమందిరాలు నెలకొల్పటం.

'చాలదూరప్రదేశాలనుండి ఆనగరానికి వచ్చిన పెక్కురు ప్రతినిధుల చిత్తవృత్తులు ఏలాటివో— బక్కచిక్కి పాలిపోయిన ముఖంగల ఒకానొక మహిళ శ్రీమతి ముంతాజ్ చౌదురాణిని చూడగానే స్పష్టంగా తెలియవచ్చింది. ఆమె సరాసరి తిన్నగా వేదికమీదికి వచ్చి సభాకార్యక్రమాలనుగూర్చి దీర్ఘంగా ఆలోచిస్తూ ఆసీనురాలయింది.

కేంద్రసంఘసంక్షేమసమితికి అధ్యక్షురాలైన శ్రీమతి దుర్గాబాయి దేశముఖుగారు ఆలస్యంగా రావటంవల్ల—అనుకొన్నట్లుగాక, అరగంట అయినతరువాత సభ ప్రారంభం చేయాల్సివచ్చింది. ఆమె రాగానే చుట్టుచేరిన స్వదేశీయ విదేశీయ ప్రతికావిలేఖకులను, ఛాయాచిత్రగ్రాహకులను చూచి "ఈసభాసమావేశకర్తలు కొంచెము ఆలస్యమయినా చిక్కులేదు —అనిచెప్పినకారణంచేతనే నేను ఆలస్యంగా రావలసివచ్చింది."— అని అన్నారు.

ఈలాటి కాలతామసంవల్ల కొంచెం ఇబ్బంది యేర్పడినా, సభాకార్యక్రమం సరళంగానూ, వ్యవహారరీతిని



న్యూ ఢిల్లీలోని కమ్యూనిటీ హాలులో 7-4-'61 తారీఖున శనివారంనాడు జరిగిన ప్రథమాఖిలభారత వేశ్యాంగనా సభా ప్రతినిధులు కొందఱితో—శ్రీమతి దుర్గాబాయి దేశముఖుగారు.

సాగిపోయింది. — ఉపన్యాసకులు తాము చర్చించదలచిన విషయాల్లోని ముఖ్యాంశాలవంకకు సూటిగా మనస్సులను మళ్లించారు.

దురదృష్టవంతురాండ్రైన స్త్రీలు వివరంగా తమమనోభావాలనూ వెల్లడించినారు. అట్టితరుణంలో శ్రీ — పి. సి. ఆర్యగారు చిరుకోపంతో "శాసనాలు తయారు అవుతున్నవి. వాటిని అంగీకరిస్తూనూ వున్నారు. కాని వాటిని విశ్వాసపూర్వకంగా అములుజరపటంమాత్రం లేదు." — "నృత్యగానాలవృత్తిని అవలంబించినవారి పిల్లలను విద్యకై బళ్లలో చేర్చేవిషయంలో విభేదబుద్ధిని చూపటం అక్రమం" — అని ఆయన ఉద్ఘాటించి చెప్పారు.

"ఒకానొకప్రభుత్వశాఖ, వారికరపత్రాల్లో ప్రచురించటానికి ప్రకటనలు ఇవ్వ నిరాకరించటమేకాక వారు టిక్కెట్లుకూడా విక్రయించతగరని శాసించింది" అని శ్రీఆర్యగారు ఉదాహరించారు. "అలాటి సౌకర్యాలు తక్కిన అన్ని సంఘాలకు మాత్రంకలిగించింది. మేమేమి చోరులమా? లేక బందిపోటుదొంగలమా? — " అని ఉద్రేకంతో శ్రీఆర్యగారు వచించారు.

సభాప్రారంభకులయిన శ్రీమతి దుర్గాభాయిదేశముఖుగారు ఇలా చెప్పారు. — "సంఘంలోని యేతెగవిషయంలోనైనా విభేదబుద్ధితో ప్రవర్తించడం సక్రమమయిన రాజనీతికాదు. ప్రత్యేకంగా అట్టిదేదైన జరిగినప్పుడు, దానిని వెంటనే అధికారుల దృష్టికి తేవలెను. కేవలం సంఘంలోని ఒకానొకతెగకు చెందినవారనే కారణంతో పాఠశాలాప్రవేశానికి గల అర్హతను నిరాకరించటానికి వీలుకాదు".

ఆమె యింకొక ముఖ్యవిషయాన్నికూడా బయటపెట్టింది:—

"బిడ్డల సర్వతోముఖాభివృద్ధికై మూడవ పంచవర్షప్రణాళికలో మూడుకోట్లు కేటాయింపబడింది. ఈ ఆర్థిక సహాయంతో, పిల్లలఆరోగ్యము, ఆహారము, పోషణము, విశ్రాంతికాల క్రీడలు మొదలగువానికి తగిన పథకాల ననుసరించి పనులు జరుగగలవు. ఇందుకు సంబంధించిన ప్రభుత్వశాఖలు తగిన సాధనాలు సమకూర్చే విషయంలో సహకరించి తీరుతుంది."

ప్రతినిధులు పరస్పరసహకారంతో పనిచేయాల్నని ఆమె నొక్కిచెప్పింది. అలా సహకారంతో ప్రయత్నించినప్పుడు — వేశ్యలేకాక, తక్కిన మహిళాసంఘమంతా కూడా బాగుపడడానికి అవకాశం ఏర్పడుతుంది. వారిసమస్యలుకూడా సులభంగా నెరవేరుతుంది. అందుచే వారు ఇతరఉద్యోగాలలో చేరటానికీ, ఇతరవృత్తులు అవలంబించటానికి తగినసాధనాలు ఏర్పడుతుంది. మూడవ పంచవర్షప్రణాళికాకాలంలో తరిబీతునొందిన యువతులు దేశంలో 20 లక్షలమంది కావలసియున్నారు.

తరువాత ఆమె అందీఅందనిజడతో 12 ఏండ్లప్రాయం గలిగిఉన్నప్పుడు నృత్యగానవిద్యలలో ప్రవీణలయిన తన పురమందలి వేశ్యలతో తనకుగల పరిచయం ఎలా ఫలవంతమయిందో దాన్నిగూర్చి ఆసమయంలో వివరించింది. గాంధీజీ 1922సం॥రం ఆమెమండలానికి వచ్చిప్పటి సంఘటనమది. పట్టణంలోని వేశ్యలు ఆయన్ను దర్శించాలనని ఉబలాటపడ్డారు. కాని మహాత్ముని సంచార కార్యక్రమాన్ని నిర్ణయించిన పెద్దలు అందులకై ఆయనకు ఒక్కనిమిషంకూడా అవకాశం ఇవ్వలేదు. కాని, ఆ మహానాయకుడు వారిని సందర్శించేపక్షంలో రు 5000లు చెల్లించాల్నని పట్టుపట్టారు. అప్పుడావేశ్యలు రు 10000లు సమకూర్చగలిగారు. గాంధీజీ వారిమధ్యకు వచ్చి ప్రసంగించగానే, వారు తమచేతిలో తొడుగుకొనియున్న బంగారు కడియాలు మున్నగు ఆభరణములను ఆయనకు సమర్పించారు. మహాత్ముడు 10 నిముషములే వారితో ఉండిపోదలచాడు. కాని ఒకగంటకాలము వారితో గడిపినాడు.

దౌర్భాగ్యదశావిష్టులై సంఘంలో దిగజారిపోయిన స్త్రీల దురదృష్టాన్నిగూర్చి ఆయన యెంతవగచాడో ఈక్రింద ఉటంకించిన ఆయన వాక్యాల్లో మనం గ్రహించవచ్చును:—

"అనేకస్త్రీలు పురుషుని కామసంతృప్తికై తమ శీలాన్ని అమ్ముకోవటం మనస్సుకు వేదన కలిగించే దుర్భరమయిన అవమానము; దురంతమయిన దుఃఖకారణము; సహింప నలవికానినైచ్యము. న్యాయమును పాలించతగిన పురుషుడిట్టి అవినీతికార్యానికి మిక్కిలి భయంకరమైన శిక్షను అనుభవించకతీరదు. ఏలయన, తనకంటె బలహీనలయిన అబలామణుల దుస్థితికి పాల్పడేటందువలన, ఇది తప్పదు." ఈవాక్యాలు కరపత్రాలలో ముద్రింపబడినవి. అవి ఇంకను మాచెవులలో మ్రోగుచుండగా ఆనాటిసభనుండి వెడలితిమి.

(9-4-'61 'టైమ్స్ ఆఫ్ ఇండియా' — లోని ఆంగ్ల వ్యాసాని కనువాదం)

# పాతివ్రత్య మహిమ

అయ్యగారి నరసింహమూర్తి

పెక్కువేల యేండ్లక్రింద
అధిష్ఠానపురమునందు
కౌశికుడను బ్రాహ్మణుండు
చిన్నతనమునందుననే,
సుగుణరాశి సుందరాంగి
సుమతి యనెడి కన్యకను
అర్థాంగిగ స్వీకరించె.

వయసు వచ్చుచున్నకొలది
కాముకుడై కౌశికుండు
సానివారితోడ చెలిమి
చేసిచేసి తుట్టతుదకు,
ఇల్లు ఒళ్ళు గుల్లచేసి
కుష్ఠురోగపీడితుడై
కుంచించుకపోయెను,

ఇట్టులైన భర్త నెపుడు
ఏవగించుకొనక సుమతి
భర్తృపాద సేవయే
పరమపూజ్యమని యెంచి,
గుట్టుమట్టు తెలియకుండ
చేయుచుండె సంసారము,

కుష్ఠువ్యాధితోడ నతడు
బాధ నొందుచుండిగూడ
సానిదానితోడి సుఖమె
సతతము తలపోసికొనుచు,
పద్మావతి వెలయాలితో
తనకు పొందుచేయుమని,
ఒక్కనాడు భార్యతోడ
పలికె నతడు సిగ్గువిడచి.

ఆపలుకులు ములుకులవలె
హృదయానికి తగిలినను
భర్తమాట కెదురాడుట
పాడిగాదనుచు నెంచి,
భర్తకోర్కె తీర్చుటకై
మదిలోన నిశ్చయించె,

వెలయాలు పద్మావతి
భర్తయొక్క స్థితిని తెలిసి
ఇష్టపడునొ పడదొ యనుచు,
సంశయమున సుమతి మొదట
వెలయాలి ఇంటికేగి
భర్తస్థితి తెలియఁజేసి
ఒప్పించుక వచ్చి, యంత
నడువలేని తనభర్తను
గంపలోన పెట్టుకొని
నెత్తిమీద మోసుకొనుచు
వెలయాలికి నప్పగింప,
కౌశికుండు వేశ్యతోడ
నాటిరాత్రి గడిపివేసె.

తెల్లవారుఝామునందు
కనుచీకటిలోన సుమతి
గంపయందు భర్తనునిచి,
నెత్తిపైని నుంచుకొని
ఇంటివైపు వచ్చుచుండ
దారితప్పి యప్పుడామె
వేఱొకమార్గాన పడియె.

ఆమార్గములోన నపుడు
మునీశ్వరుడు మాండవ్యుడు
దొంగయనెడి నెపముచేత
కొఱుతవేయబడియుండెను.

మాండవ్యమహామునికి
చీకటిలో పోవుచున్న
కుష్ఠురోగి గంప తగిలె,
గంప తగుల మాండవ్యుడు
బాధచెంది వెనువెంటనె,
అరుణోదయమగుసరికే
నీదుభర్త శిరము వేయి
చెక్కలగునని శాపమిచ్చె.

సుమతి యంత మునీశ్వరుని
"ఈకార్యము నేనిప్పుడు

తెలిసిచేయలేదు బాబు,
చీకటిలో కనుగానను,
పొరపాటే జరిగినది,
ఈసారికి క్షమియించి
పతిభిక్షను పెట్టుమని
శతవిధముల ప్రార్థించెను,

ఎంత సేపు బ్రతిమాలిన
మంకుపట్టు విడువమిచే
"పతివ్రతనే యైనయెడల
ప్రొద్దు పొడువకుండుగాక"
అనుచు శాపమిచ్చి, యంత
ఇంటి కేగెను భర్తతో.

పతివ్రత ప్రభావమున,
ఎంతకాలము గడచినను,
ప్రొద్దు పొడువకుండుటచే,
త్రిమూర్తులు దేవతలు
తల్లడిల్లి బెగ్గడిల్లి
దివ్యజ్ఞానంబుచేత
విషయమంతయు తెలిసికొని,
సుమతికడకు వచ్చి వారు
"నీపాతివ్రత్యము నిండై
నది కొమ్మ: అమ్మ ఇప్పుడు
భాస్కరుండు రానియెడల
లోకములే నశియించును,
కాన నరుణోదయమునకు
అనుజ్ఞనిమ్ము తక్షణమని
వేడుకొనగ, నామెయును
సూర్యుడుదయమైనయెడల,
నాదుభర్త శిరము వేయి
చెక్కలగును, కాన మీరు

నాథ ర్తను బ్రతికించిన
మీకోర్కెను తీర్తు"నని
బదులు పలుక, బ్రహ్మాదులు
అందులకై ఇష్టపడిరి.

"అరుణోదయమగు గాక"ని
సుమతినోట పలుకగానె,
అరుణోదయమయ్యె, నంత
మాండవ్యుని శాపముచే
సుమతి భర్త శిరము వెయ్యి
చెక్కలుగా చీలిపోయె.
అంతట, నా బ్రహ్మాదులు
ముక్కలన్ని ప్రోగుచేసి
కౌశికుని మూర్తిచేసి
నవయౌవనుడగునట్లుగ
వరమునిచ్చి మాయమైరి.

ఈవిషయము వినినంతనె
ఊరిలోని వారందరు
సుమతి దర్శనార్థమయి
చనుదెంచి ముదముతోడ ఆ
శీస్సులుగొని యరుగుచుండిరి.

నాటినుండి కౌశికుండు
సానివారిపొందు విడిచి,
భార్యతోడ పెక్కుపండ్లు
సాంసారికసుఖములను
అనుభవించె హాయిగాను.

కావున పాఠకులందఱు
పతివ్రతామహిమ యన్న
దేవుడైన లొంగునని
తెలిసికొనుడు దీనివలన.

---

"ఆనంద" మనునది మన బహిరంతరములలో ఎక్కడను లేదు, అది ఆత్మానుసంధానమ్మున పరమాత్మయందు విలీనమగుటలో మాత్రమే కలదు. (పాస్కల్)

ప్రకాశవంతమగు రత్నముకంటెను, సుగంధబంధురమయిన పుష్పముకంటెను ప్రేమపూర్వకమగు హితమును మనమిత్రుని మనస్సున కెక్కునట్లు ఉపదేశించుటయే అతనికి దేవతావరప్రసాదమువంటి గొప్పబహుమాన మగును. (జి. మేక్డనాల్డు)

# చేతిపనులు - కుటీరపరిశ్రమలు

మనదేశంలోను రాష్ట్రంలోను అనాదినుండి అనేక చేతిపనులు కుటీరపరిశ్రమలు మనప్రజలకు జీవనోపాధి కల్పిస్తు, (వ్యవసాయంతర్వాత) జాతీయఆదాయానికి, సంస్కృతిసంరక్షణకి తోడ్పడుతున్నసంగతి అంతా ఎరిగిందే. వీటిప్రాధాన్యత గమనించిన దేశపిత పూజ్యగాంధీజీ, వీటిపునరుద్ధరణ తన అష్టాదశ నిర్మాణసూత్రాల్లో ఎంతో దూరదృష్టితో ఏనాడో చేర్చాడు. తదాదిగా ప్రజలూ జాతీయప్రభుత్వమూ కూడ పూనుకొని అఖిలభారత చేతిపరిశ్రమల బోర్డును ఏర్పరచుకొని అమోఘకృషి గావిస్తు సాధించిన ఫలితాలుకూడ అంతా గమనిస్తున్నారు. ఈచేతితో చేసే వస్తు ఉత్పత్తిదారుల సహకారసంఘాలు ఏర్పరచడంవల్ల, ఆవస్తువుల విక్రమానికి ముఖ్యప్రాంతాలలో ప్రభుత్వంవారు ఎంపోరియాలు నెలకొల్పి గొప్పగా తోడ్పడుతున్న విషయంకూడ అందరికీ తెలిసిందే, ఇలాగ హైదరాబాదు ఎంపోరియంఒక్కచోటే సాలీనా, 6-7 లక్షల రూపాయల విలువగల వస్తువులు విక్రయించగలుగుతుంది. ఇవి ముఖ్యంగా బిదిరీవస్తువులు, ఫిలిగ్రీ, (వరంగల్, ఏలూరు) తివాసీలు, నిర్మల్ చేతిపనులు, (తిరుపతి, ఏటికొప్పాక- నిర్మల్, కొండపల్లి) బొమ్మలు, హిమ్రూశాలువలూ, కొమ్ము, దంతపు వస్తువులూ, నర్సాపూరు లేసులు, హైదరాబాదు గాజులు, మహబూబునగరు తుంగచాపలు, (గద్వాల్, ఉప్పాడ, వెంకటగిరి, పోచంపల్లి, ఆర్మూరు, ధర్మవరం) చీరలు యిత్యాది చేతిపరిశ్రమల సరకులు విరివిగా అమ్ముడుపోతున్నవి.

ఈప్రభుత్వ (చేతివనులు-కుటీరపరిశ్రమల) ఎంపోరియాలు గావిస్తున్న సేవ, యింకా సర్వతోముఖంగా అభివృద్ధిచేయడానికని, మనరాష్ట్ర ప్రభుత్వం ఇటీవల ఒక సలహాసంఘాన్ని నియమించింది. ఈకమిటీ మెంబర్లు శ్రీమతి నరోత్తమరెడ్డి (2) మిసెస్. బ్రూటన్, (3) శ్రీమతి జయవంతరావు, (4) మిసెస్. ఎ. దే, (5) మిసెస్. రోడామిస్త్రీ, (6) మిసెస్. బి. ఎల్. ఓట్సు, (7) శ్రీమతి-యం. పి పాయ్, (8) మిసెస్.



(కుటీర పరిశ్రమలు)— పేముపనులు.

ఎ. బావా, (9) శ్రీమతి శ్రీరామభోపాల్, (10) శ్రీమతి పి. యమ్. నాయక్, (11) కుమారి మినాలినీ ఛటోపాధ్యాయ, (12) శ్రీమతి యస్. కృష్ణస్వామి, (13) శ్రీమతి సీతాయుధ్‌వీర్, (14) శ్రీమతి. ఎ. శ్యామలా దేవి, (15) శ్రీమతి సుశీలవర్మ, (16) శ్రీమతి కె. సుగుణమణి., ఈకమిటీ రెండు సంవత్సరాలు వుంటుంది. ఈసభ్యులాంద్రు కొన్ని సబ్ కమిటీల సహాయంతో క్రిందివిషయాలలో సలహాలు యిస్తారు.

(1) ఎంపోరియాలలో వస్తువుల ప్రదర్శన, విక్రయం విషయాలపై అభివృద్ధి సూచించే సలహా యిస్తారు.

(2) ఎంపోరియాలలో ప్రదర్శించి, విక్రయించే వస్తువులరకాలలో మార్పులు అప్పుడప్పుడూ నిర్ణయిస్తూవుంటారు.

(3) సహకారసంఘాలలోను, తదితర ఉత్పత్తి కేంద్రాలలోను యీవస్తువులు ఎంచి, సేకరించి, ఎంపోరియాలకు విక్రయానికి సర్ఫరా చేస్తుంటారు.

(4) ఆ యా వస్తువుల నాణ్యత, డిజైనుల విషయమై ప్రత్యేక స్టాండర్డ్సు నిర్ణయిస్తుంటారు.

(5) తక్కువ నాణ్యతగల వస్తువుల యొక్క గణ్యత పెంచడానికి సలహాలిచ్చి, పెచ్చుస్థాయిలోనికి తేవడానికి ప్రయత్నిస్తారు.

(6) చేతిపరిశ్రమల డిజైనులు, నైపుణ్యం అభివృద్ధి చేయడానికి, ఈచేతివస్తువులమీద ప్రజాదరణ, మోజూ పెంచడానికి పోటీలు, ప్రదర్శనలు–జరిపే ఏర్పాట్లుకు సలహాలిస్తుంటారు.

(8) ఎంపోరియాల వార్షిక జమాఖర్చులు అంచనాలు తయారు చేస్తుంటారు.

కె. సుగుణమణి,
సంయుక్త కార్యదర్శిని.

# నేను గ్రహించిన భగవద్గీతా ప్రభావం

శ్రీ సాధు- టి. యల్. వాస్వాని.

చాలాసంవత్సరాలకుముందు నేను హైదరాబాదులోని ఒకఉన్నతపాఠశాలలో చదివేదినాల్లో, శ్రీకృష్ణుణ్ణిగూర్చి, గీతలనుగూర్చి ప్రకటింపబడ్డ- ఒకకరపత్రాన్ని చూడటం తటస్థించింది. దానివెల చాలాస్వల్పం అయినందున కొని చదవగలిగాను. (క్రిస్టియన్ లిటరరీ సొసైటీ) క్రైస్తవ సారస్వత సంఘంవారు దాన్ని వెలివరిచారు, అందులో శ్రీకృష్ణుణ్ణిగూర్చి కొన్నివాక్యాలు వ్రాయబడ్డాయి; కాని, అది సదభిప్రాయంతో — సమగ్రదృష్టితో రచింపబడ్డవి కావు. కాని, ఆకరపత్రంలోనే భగవద్గీతలనుండి కొన్నిశ్లోకాలకు. అనువాదాలు గమనించినపుడు, అది నాకుగల ఉత్సాహాన్ని తొలగించాయి, వెంటనే, ఎలానయినా, దాని మూలగ్రంథాన్ని పఠించాలనని తోచింది.

నేను కరాచీలోని కళాశాలలో చేరాను. నాపఠనీయ భాగంగా సంస్కృతాన్ని నేర్చుకోవలెనని నిశ్చయించుకొన్నాను. సంస్కృత పద భూయిష్ఠాలయిన మంత్రాలు కంఠతః బట్టీపట్టాను. కొన్ని గీర్వాణ నాటకాల్నికూడా చదివాను. దేవభాషలో న్యాయశాస్త్రం (Logic) తీసికొని శ్రద్ధతో అభ్యసించాను. "వ్యాప్తి" సిద్ధాంతంమీద నాకు ఎంతోఅభిలాష. కాని, ఇంతకూ ఆనిర్జరభాషలో అంత ప్రవీణుణ్ణి కాలేకపోయాను.

తరువాత "ఈ ప్రాచీన మతగ్రంథాన్ని స్వతంత్రంగా నావరకు అర్థమయ్యే మోస్తరు ఏకాంతంగా ఒకచోట స్థిరంగాకూర్చుని ఏకాగ్రచిత్తంతో చదవటానికి పూనుకొన్నాను. కళాశాలోద్యోగవర్గంలో ఒకసభ్యుణ్ణి అయినాను. ప్రత్యేకంగా కళాశాలా విద్యార్థులకోసం, కొలదిమందితో గీతాబోధనము చేయటానికి ఒకతరగతిని ప్రారంభించాను. కొంతకాలానికి డి.జే. సింధుకళాశాలకు బోధకుడనుగ ఉద్యోగస్వీకారం చేశాను. అక్కడ నేను వేదాంత (Philosophy) శాస్త్రబోధకుడుగ పనిచేయాల్సివచ్చింది. మరలా నేను గీతోపదేశార్థం తరగతులను మొదలుపెట్టాను. దాల్లో విద్యార్థులసంఖ్య నానాటికి పెరుగసాగింది. వారంవారం గీతోపన్యాసాలు ఇవ్వాలిసిన భారం నాపాల బడింది.

అంతలో ఒకవిచిత్ర సంఘటన జరిగింది: ఆకళాశాలాధ్యక్షుడు, కృపార్ద్ర హృదయం గల ఒకనొక ఆంగ్లేయుడు, అతడు నన్ను పిలిపించి:— "ఈకళాశాలావరణంలో నీవు విద్యార్థులకి గీతోపన్యాసాలిస్తున్నావటగా?" అని అడిగాడు. 'ఔ'—నన్నాను. "భగవద్గీతాగ్రంథం ప్రపంచపరివర్తనం కలిగించేది. దాన్ని ఈవిద్యామందిరావరణంలో బోధించరాదు. అందుకై యీస్థలం ఉపయోగించటం నేనేమాత్రం సమ్మతించను." అతడి వాక్యాలనుగూర్చి నాలో నేను అనేకవిధాల తలపోశాను. అందుకా కళాశాలాధికారిని నేను నిందించలేదు. ఏలనంటే, అతడు విద్యాసంస్కారంగల ఐరోపాదేశస్థుడు. కూడా పనిచేసే బోధకులలో కొందరు దురదృష్టవశాత్తు అలాటి అపోహని ఆయనకు కలిగిస్తూ తెరవెనుక ఉండిపోయారు. అతడుణంలో వాళ్లకి ఆగ్రంథం మనస్సును తిరుగుబాటు మార్గానికి త్రోవచూపేదిగా తోచింది. అది నిజమే. అయినా, ఆతిరుగుబాటు రాజకీయంగా కాదు. జీవితవిషయకంగా మాత్రమే, మానవజీవితంలో పరివర్తనం తప్పక కలిగితీరాలి. లేకుంటే పతనం సర్వవిధాలా నిశ్చయం.

కృపాపరుడైన మాప్రధానాధ్యాపకుడితో ఇలాచెప్పాను. "నిజమే. మీరన్నట్లు భగవద్గీత తిరుగుబాటుకు దారిచూపే గ్రంథమే, అయితే జీవితపు విలువలమీదే దానితిరుగుబాటు: ఆలాటిది సంభవిస్తే చూడాల్ననే నాకుతూహలం," అని యింకా విపులంగా ఆయన కాపరివర్తనాన్ని వివరించాను. నా అప్పటి వ్యాఖ్యాన సారాంశం ఇది: "సింధుదేశవాసులు సున్నితమయిన జీవితాలకు జితపడినవాళ్లు. అలాటివాళ్లకి గీతాసందేశం ఏమంటే. 'ముక్కలి శక్తిసంపన్నులరుగా ఉండుడు. నిరంతరచైతన్యం కలిగిఉండుడు. పిఱికితనము విడిచిపెట్టుడు. స్తబ్ధత్వాన్ని దూరంగానెట్టుడు. పట్టువదలకుడు. ఈ సూక్తులు కళాశాలా విద్యార్థిదశలోనే మన యువకులు ఆచరణలో పెట్టాలి. పరివర్తనమనేది వెలుపలినుండి వచ్చేసంస్కారం కాదు; అది అంతరంగంలో పుట్టి వచ్చేది."—నావాక్యాలు ఆ అధికారి చెవిని వేసికొనే స్థితిలో లేడు. "ఇకమీద గీతాప్రబోధానికి కళాశాలావరణంలో ఏలాటి విద్యార్థికూటముగాని— సమావేశంగాని జరుగరాదు" అని ఆయన ఉత్తరువు జారీచేశాడు. దాన్ని నేనుశిరసావహించాను.

కాని, గీతోపదేశంకోసం విద్యార్థుల తరగతులు మునుపటిప్రకారమే జరపటానికి నిశ్చయించాను. కానీ కళాశాలలోకాక, మరొకభవనంలో,—గీతలను చదివి దాని పరమార్థం మనస్సుకు తెచ్చుకొని శిష్యులకు విశదపరిచేవాణ్ణి.

అప్పటి మరొకవిశేషం:—లోకమాన్యతిలకు ఆసమయంలో భారతదేశ రాజకీలకు మహానాయకుడు. ఆయన భగవద్గీతలను సమ్యక్పరిశోధనతో— సమగ్రంగా పరిశీలించి, దాని మీద ఒక బృహద్గ్రంథం వ్రాశాడు. ఈవిషయం జగద్విదితం. 'గీతారహస్యం'—అని ఆకృతి నామధేయం. ఆసాంతం ఆగ్రంథం ఒక దివ్యప్రబోధదాయకం. భగవద్గీతా ప్రబోధాన్నంతా—ఆయన 'కర్మయోగం'- అని ఒకముక్కలో చెప్పాడు. నాకు తక్కిన భారతదేశ రాజకీయనాయకులందరికంటే— లోకమాన్యుడియందు ఎక్కువగౌరవం. అందువల్ల ఆయనగారి మహత్తరమయిన అభిప్రాయంతో నేను సంపూర్ణంగా ఏకీభవించాను. అది నానరాల్లో గాఢంగా నాటుకుని మనస్సుకు హత్తుకుపోయింది. నా ఆత్మలోనించి విడదీయరానంతటి అవినాభావ సంబంధం- దానికీ నాకూ ఏర్పడిపోవటంచేత, 'నేను వేరు'- అనేభావమే లేకపోయింది. 'నేనే కర్మయోగం! కర్మయోగమే నేను!

ఆరోజుల్లో గీతాభావసంగ్రహాన్ని మాటిమాటికి మననంచేసుకునేవాణ్ణి; జ్ఞప్తికి తెచ్చుకునేవాణ్ణి; ప్రబోధించేవాణ్ణి. ఆవాక్యాలు గీతలలో భగవానుడు- ఏలా చెప్పాడో, అలా- ఈక్రింద ఉటంకిస్తున్నాను:-

"అర్జునా, నీధర్మాన్ని నెరవేర్చు, నీకర్తవ్యాన్ని నిర్వహించు."

ఇదే తిలకుమహాశయుడు తనదేశీయులకు విస్పష్టం చేశాడు. నాకాయన మహోన్నతాశయం బాగా నచ్చింది. ప్రతివ్యక్తికీ నియతంఅయిన ధర్మంఒకటి ఉన్నది. దాన్ని నెరవేర్చాలి. కర్తవ్యాన్ని ఎవ్వడూ విస్మరించకూడదు. ఈసందేశమే, భగవద్గీత ఎలుగెత్తి చాటుతుంది.

## అదే కర్మయోగం

ఇంతలో నాజీవితంలో- నేనెన్నడు ఊహించని విషయం ఒకటి తటస్థించింది. దైవికంగా దూరదేశాల సంచారం చేయాల్సనే బుద్ధి పుట్టింది. సముద్రాల కవతలి భూములు చూడటానికి ప్రయాణం కట్టాను. 'బెర్లిను'నగరంలో ప్రపంచ సర్వమత సమ్మేళనం జరుగనున్నందున జర్మనీదేశానికి బయలుదేరాను. అక్కడసభలో పాల్గొని, అవి ముగియగానే ఇంగ్లండుకు వెళ్లాను. అక్కడనుండి మరికొన్ని దేశాలకు పోవటం, అందందు నూత్నానుభవాలు పొందటం సంభవించింది. అలాంటి సందర్భంలో- ఈకర్మయోగ సిద్ధాంతాన్నిగూర్చి ఇరువురు గొప్ప పండితులతో సంభాషించాను. అందు ఒకాయన బ్రిస్టల్‌నగరవాస్తవ్యుడయిన ప్రొఫెసరు 'సిబ్రి(Sibree)'- అనేఅతడు. సంస్కృతసారస్వతంలో అతడు నిశితమేధానిధి. ఆత్యాదరాభిమానపూరితుడు. ఆయన ఇపుడులేడు. కాని, అతడెంత శ్రద్ధాసక్తులతో గీర్వాణగ్రంథాలని చదివేవాడో నాకు బాగా జ్ఞాపకముంది. ప్రాచీనభారతీయ సంస్కృతియెడల ఆవిద్వాంసుడి అభిమానం అసామాన్యం అయింది.

రెండవ సంస్కృతభాషాపారంగతుడు' బెర్లిన్'వాడే. ఆతర్వాత పెక్కేండ్లకు అతడు మనదేశానికి వచ్చాడు. కూడ. ఈమహాపండితుడు శ్రీరవీంద్రనాథఠాగూరుచే స్థాపింపబడ్డ 'శాంతినికేతన్'- అనే విశ్వకళాశాలను సందర్శించినాడు. ఈ ఉద్దండవిద్వాంసుని నామము ప్రొఫెసరు "వింటర్నిట్జ్, (Winternitz)". ఇతడు సంస్కృతంలోని భగవద్గీతలను, ఉపనిషత్తులను వ్యాఖ్యానాలతో క్షుణ్ణంగా చూచిన ప్రజ్ఞాశాలి. నేను తిరుగుప్రయాణానికి సిద్ధపడుతూ, ఇతణ్ణి సందర్శించాను. మేము ఇరువురం సంభాషించేటప్పుడు, ప్రాచీన ఆర్యావర్తానికి సంబంధించిన అనేకవిషయాలనుగూర్చి సమగ్రంగా చర్చించాము.

అనంతరం "నేనిక సెలవు పుచ్చుకుంటానండి" అని లేచి, నాతోబాటు సాగనంపటానికి లేచిన వింటర్నిట్జుతో కరచాలనం చేస్తూ "నేను శీఘ్రంగా తిరిగి మాదేశానికి వెళ్లాలి. నేను మీకేమి చేయకోర్తారు?"- అనిఅడిగాను. ఆతడు కొన్నివిషయాలు చెప్పాడు. కాని, అవి మనస్సులోనే లీనమయ్యాయి. ఆయన ఇలా పలికాడు: "మరలా నీవు భారతదేశానికి తిరిగి వెళ్లగానే, నీకు సాధ్యమయితే, సంస్కృత లిపిలో వ్రాయబడ్డ వ్రాతప్రతిని ఒకపుస్తకాన్ని పంపాలి. అచ్చయిందికాదు సుమా! భారతజాతి విజ్ఞానసంపద సంస్కృతమూలమయిన వ్రాతప్రతిలో ఇమిడిఉంటుందని, అట్టిది అచ్చులో తొలగింపబడి వుంటుందని నావిశ్వాసం" అని అన్నాడు.

ఈ విశ్వవిద్యాలయ పండితులు నిజంగా సంస్కారం, వినమ్రత గల గొప్ప భాషాభిజ్ఞులు. నాలో భగవద్గీతాదరము ఈవిద్వాంసులప్రోత్సాహంవల్ల మరింతలోతుగా పాతుకుపోయింది.

కొన్నియేండ్లు ఆరీతిగా సాగిపోయింది. ప్రకృతిలో నేనొకపదార్థంగా జీవయాత్ర గడిపాను. పర్వతప్రాంతాల్లో మహాగహనాల్లో అలజల్లకు, అల్లకల్లోలాలకు, అత్యధిక మానవసంఘ నివాసాల పెడబొబ్బలకు, ఆరపులకు దూరస్థుణ్ణి అయి, మౌనం అవలంబించి, ప్రశాం

తంగా ఉండి భగవద్గీతావాక్యాల మననంలో అభివృద్ధి చెందాను. గీతార్థభావం అరచేతి ఉసిరికమోస్తరు, చక్కగా జీర్ణించుకున్నాను. "భగవద్గీత పవిత్రార్థ ప్రబోధక వేదం. ఆత్మవిద్యోపాసకులు అనుసరింపదగిన ఆమ్నాయం." అనే అభిప్రాయం నాలో స్థిరపడింది. అగ్రంథోక్త విషయాలపై ఆసక్తి పెచ్చుపెరిగి, అది నాపాలిటికి ఒక సువార్త అయింది. నాధర్మాన్ని నాకర్తవ్యాన్ని చక్కగా విస్పష్టంచేయగలిగింది. మానవలోకానికి ఆత్మోద్ధరణార్థం సమకూర్చబడిన పెన్నిధిగా నాకది కనబడింది.

గీతను 'ఆత్మవిద్యగానే భావించి నేను ఎప్పుడూ వ్యాఖ్యానించేవాణ్ణి. అయితే, ఈ 'ఆత్మవిద్య' అనేది ఏమిటి? శ్రీకృష్ణుడిచే అతడత్యంతము ప్రేమించు శిష్యుడైన అర్జునుడికి ఈ 'ఆత్మతత్వ' రహస్యాన్ని అతడేల బోధింపవలసివచ్చింది?

ఈ 'ఆత్మవిద్య' అనేది ప్రప్రథమంగా జీవాత్మకు సంబంధించింది. రెండోది, అది జగత్తుకూ అనువర్తిస్తుంది. మూడోది జీవాత్మ, పరమాత్మయందు లీనమయి, ఎలా ఏకత్వాన్ని పొందుతుంది? మొత్తానికి మానవునిలోని ఆత్మనుగూర్చి చెప్పే ఆత్మతత్వశాస్త్రమే భగవద్గీత. జీవుడయిన మానవుడు నిత్యత్వంగల పురుషునినించే వచ్చాడు. జగత్తు ప్రకృతి. కనుక నరుడు తనలోని దైవత్వమును (పురుషార్థాన్ని) గమ్యంగా చేసుకొని ప్రవర్తించటమే యోగ మనబడుతుంది.

జీవుడు ఈవిశ్వంలో, తన నిత్యత్వంనుంచి భ్రష్టుడై వచ్చి చరిస్తాడు. ఈఒక్క విషయాన్నే శ్రీకృష్ణుడు అర్జునుడికి పెక్కురకాలుగా ఉపదేశిస్తాడు. "మీరందరు శాశ్వతస్థానంనించి విభ్రష్టులయినవారు. ఇక్కడినుండి మీస్వస్థానాలను మీరు చేరుకోవాలి. అస్వస్థానాలే ఆత్మలు. జీవుడు నాటకపాత్రధారివలె ఈప్రపంచానికి వచ్చాడు. మాయవల్ల ఆతడట్టినాటకంలో పాల్గొనక తప్పదు. పురుషుడికి ప్రకృతికి మధ్య ఈనాటకం ఈలా సాగిపోతూ వుంటుంది. వలదనుకున్నా, ఈనాటకాన్ని జీవుడు ఆడేతీరాలి. ఇది ఒకపాచికలాటవంటిది. ఈజీవులు ఎందరు మరల తమస్వస్థలాలు చేరుతారో ? ఏల అట్లుచేరుతారో? మొదటిది ప్రకృతిక్రియ. రెండవది యోగమూలకం."ఇదే గీతోపదేశం. గీత ఒక గొప్పయోగశాస్త్రం. యోగమనగా, ఐక్యం. జీవాత్మ పరమాత్మతో ఐక్యం కావటమే యోగం. పరమాత్మగుండా భగవచ్చిద్విలాసంలో ఒక్కటిగా మెలగటమే యోగం. అందుకే జీవు డీజగత్తులో తన పయనం సాగించాలి. ఇదే గీతార్థవ్యాఖ్యానం. అది మనకిచ్చే మహదుపదేశసారాంశం. ఈపరమార్థమే. మూడుముఖ్యాంశాలను గీత మనకు బోధిస్తుంది. జీవుడన ఎవడు? జగత్తు అన నేమి? మాయ అనబడునది ఏది? యోగసాధనకు మార్గమేది? నిత్యత్వమును మనం ఎలా పొందగలము?

కాలం గడుస్తున్నది. కాని నేను యోగశాస్త్ర తత్వాన్ని ఇంకా అవగాహన చేసుకోలేకుండా ఉన్నాను. గీతాప్రబోధాన్ని పలుమారు మననంచేస్తూ కూడా అందులోని మహద్విషయ వివేకం కలుగని కారణం ఏమో? అది నిరంతరం మననం చేయటంవల్ల ప్రత్యేకపరిజ్ఞానం కలుగుతుందంటారు. ఇంకా లోతుగా గీతార్థాన్ని గురించి ఆలోచించాను. ఎప్పుడు ఆతత్వార్థంమీదే ధ్యాస. ఏకాంతంగా ఎన్నో చెట్లనీడలను ఆశ్రయించి గంటలకొద్దీ, దినాలకొద్దీ, ధ్యానసమాధిలో నిమగ్నుణ్ణి అయివుంటూవచ్చాను. "భౌతిక వస్తు పరిజ్ఞానం జాగ్రత్తగా పరిశీలించటంవల్ల లేదా పరిశోధనలవల్ల మనకు కలగవచ్చును. ఇక్కడ కావలసినది శ్రద్ధాసక్తుల కేంద్రీకరణమా? కాదు. (1) ఇంద్రియ కేంద్రీకరణం (పంచేంద్రియాలు ఒకేవిషయం మీదికి ఏకోన్ముఖంగా ప్రసరించటం) (2) మనస్సు. సహజమనోవ్యాపారం, అనగా ఐదింద్రియాలూ ఒకేకొలికి తెచ్చి, మనస్సును అకార్యంలో ప్రవేశపెట్టడం. మన పంచేంద్రియాలు జ్ఞానార్జనవిషయంలో మహత్తరమయిన ఉపకారంచేస్తున్నాయి. ఇంద్రియవశంలోని కార్యాలకు మనలను కర్తలనుగా చేసేవస్తువే మనమనస్సు. కాని, సామాన్యవిషయాలనుగూర్చి ప్రబోధించేవి పంచేంద్రియాలు, మనస్సు అనేవిమాత్రమే.

అయితే, ఆధ్యాత్మిక పరిజ్ఞానం మనకు ఎలా కలుగుతుంది? ఆవిజ్ఞానం మనకు ఎందాక ఉపకరిస్తుంది? సామాన్య విషయాలనుగూర్చిన తెలివిని గీత "వ్యావహారిక విద్య" అని చెబుతుంది. అది ఆత్మవిద్యకు భిన్నమయింది. ఈలోకాన నీ నిత్యవ్యవహారాలవరకే ఈవ్యావహారిక విద్యా ప్రయోజనం. వీటికికూడ పంచేంద్రియాలు మనస్సు సాధనాలు కావచ్చు. అంతేకాని, తార్కికంగా నీమనస్సు అభివృద్ధిపొందడం నీవు గ్రహించిఉండవు. ఏలనంటే నీమనస్సును, దానితోబాటు నీయింద్రియాలను కొంతవరకు స్వానుభవస్థితిని అధిగమించి ఉంటుంది. అయితే ఈస్వానుభవం అనేదే ఆత్మవిద్య అని భ్రమపడటం పెద్దపొరపాటు. మరీ ఆ స్వానుభవమనేది ఏమిటి? ఈ ప్రశ్న నాకు నేనే ఎన్నోసార్లు వేసుకొని సమాధానం కొరకు ఎదురుచూచాను. తుదకు తేలిన విషయం ఇది:

"నేను దేన్ని మించి పోదలచానో, ఆచక్రంచుట్టు అల్లే తిరుగుతూ, దానికి దూరం అయ్యాను. పంచేంద్రియాల పరిర్తనాన్నిగాని, మనస్సుయొక్క తార్కికాన్నిగాని లక్ష్య పెట్టక అతిక్రమించాను. ఇక దేన్ని అతిక్రమించలేను? అతిక్రమించినా పొందగలిగినా, ఆత్మపరిజ్ఞానమేముంది? అలా పొందగలగటానికి మార్గమేది? అలా పొందగలగని యెడల ఆత్మవిద్య గ్రహించటానికే నాలో ఆస్కారముండదని నానిశ్చయం. అప్పుడు జీవాత్మపరమాత్మలకు విభేదాన్ని దూరంచేసే చక్రమే నాకు సాధనమవుతుంది. అట్టితరుణంలో నన్ను నేను తెలిసికోదగు ఊహను నాపంచేంద్రియాలు మనస్సు నాకు కలిగిస్తవి. అదే స్వానుభవమనేది.

లోకంలోని వస్తువుల ఆకృతులనుబట్టి వాటి తత్వాల్ని గ్రహిస్తాము. ఏలనంటే, ఈజగత్తే రూపలోకం. దీన్ని మనం కండ్లార చూస్తాం. కాని, మనం అదృశ్యరూపంలో వున్న ఒకమహచ్ఛక్తిని గూడా స్వానుభవం వల్ల నిరూపిస్తున్నాం. దాన్ని మనం 'ప్రాణం' అనీ, 'ఆత్మ' అని అంటాం. ఆయాత్మను భరించేవాటిని కోశములు అని ఆర్యులన్నారు. కోశభరితాత్మలు ఛాయామాత్రములు. అప్పుడు నాకు ప్లేటో చిత్రించిన పెద్దచిత్రం ఒకటి జ్ఞాపకానికి వచ్చింది. అది "గుహలోని మానవులు" అనేచిత్రం. అందులో రూపాల నీడలే గోడలమీద నృత్యంచేస్తాయి. "గవిలోని మనుష్యులు" అనే ఆ ప్లేటోచిత్రంలోని గోడలపై నాట్యంచేసే ఛాయలనే మనం నిజమయిన నరులుగా భ్రమిస్తున్నామని తోస్తుంది. లేకుంటే, మాయకులోబడిన జగజ్జీవుల నరులుగా తలంచటం మాయాపాశబద్ధులం కావటంమూలాన్నే, కదా! వాటి నిత్యత్వాన్ని గూర్చి యేమాత్రంకూడా అప్పుడు ఊహించజాలముగదా! మనమింక పంచేంద్రియాల కోశాలను లేదా చక్రాలను మనస్సును ఎలా ఒకచోటే కేంద్రీకరించి నిశ్చయాన్ని తెలుసుకోగలం?

"ఆత్మతత్వ జిజ్ఞాస గలవాడు. సమ్యజ్ఞానంచేత నిశ్చయాన్ని గ్రహించగలడు" అని శ్రీకృష్ణుడు అర్జునుడికి చెప్పాడు. అపుడు నేను ఆత్మను గుర్తించగల సమ్యక్ జ్ఞానానికీ భౌతిక వస్తు తత్వం తెలుసుకోగల సామాన్యవిజ్ఞానానికీ చాలాతేడా ఉందని తెలుసుకొన్నాను.

మనం మాయఅనే నీడలో ఉన్నాము. మన పరిసరాలు పరికించండి. లోకమంతా దేనికోసం పాటుపడుతున్నట్టు? దేన్ని ఆశించి మానవులు ఇలా పరవళ్లు త్రొక్కుతూన్నట్టు? వాళ్లకు కావాల్సినవి, వెండి, బంగారం, ఐహికలోక బిరుదాలు! పెద్దపెద్దపేరుప్రతిష్ఠలు! గౌరవాలు! ఇంతేనా? ఎప్పుడు మనకాత్మోన్నతిమీద దృష్టి పారుతుందో మరి? మన శాశ్వతగమ్యస్థానం ఏనాటికి చేరుకోగలమో? అంతఃచక్రాలన్నీ కేంద్రీకరణం కావటం ఎప్పుడో? నిశ్చయాత్మతత్వం ఎప్పుడు బయటపడుతుందో!

---

## చాటువులు

"కాలిచేదిన వగలేకనే, అడిగితే కోపించు టీలేకనే,
చెలులన్ మెచ్చుట కోకనే, విభముల్ చేకూరుటల్ రూకనే
బలవంతుండగు మూకనే, సతిచెడున్ ప్రాణేశుఁ గైకోకనే
జలదశ్యామల, శంఖచక్రధర. కృష్ణా, ఆపదుద్ధారకా"

"మాటలచేత దేవతలు మన్నన నిత్రు మహద్వరంబులన్
మాటలచేత భూపతులు మన్నన నిత్రు మహత్పదంబులన్
మాటలచేత కామినులు మన్నన నిత్రు మహత్సుఖంబులన్
మాటలు నేర్వకున్న, నవమానము, న్యూనము, మానభంగమున్"

"రసవాదంబుల నభ్యసించిన, మహారాజేంద్రులం గెల్చినన్
వెస సన్మంత్రము లుచ్చరించిన మహావేదంబుల న్నేర్చినన్
అసహాయంబున శూరుఁడై నిలిచినన్, అంబోధి లంఘించినన్
నొసటన్ వ్రాసిన వ్రాఁతకన్నఁ గలదా, నూఱేండ్లు చింతించినన్"

# ANDHRA MAHILA SABHA

## NURSING HOME & NURSES' TRAINING CENTRE

### Statistics for the Month of March 1961.

**OUT-PATIENT REGISTER:—**

| | | |
|---|---|---|
| | No. of Surgical cases treated | 28 |
| | „ „ Medical „ „ | 563 |
| | „ „ Ante-natal „ „ | 216 |
| | „ „ Post-natal „ „ | 45 |
| | „ „ Gyneac „ „ | 131 |
| | „ „ E.E.N.T. „ „ | 40 |
| | „ „ Dental „ „ | 7 |
| Total | „ „ New Patients Treated | 1,030 |
| „ | „ „ Old „ „ | 1,095 |
| | Grand Total | 21,25 |

**ADMISSION REGISTER:—**

| | | |
|---|---|---|
| No. of Patients admitted for Normal Deliveries | | 116 |
| „ „ „ „ „ Abnormal Forceps | 7 | |
| Extended Breech | 1 | 8 |
| „ „ Ante-natal cases e Toxeamia | | 2 |
| „ „ Ante-natal cases e False Pains | | 22 |
| „ „ Post-Natal cases | | 2 |
| „ „ Gyneac cases | | 31 |
| „ „ Medical „ | | 8 |
| „ „ Surgical (Puerperal Sterilisation) | | 3 |
| „ „ Babies admitted as Lodgers | | 132 |
| Total | | 324 |

(True Copy)

(Sd.) Dr. K. R. AMBUJA
*Resident Medical Officer.*

(Sd.) Dr. M. PAVANA BAI,
*Medical Superintendent.*

Smt. V. LAKSHMI PARVATI.
*Secretary.*

# అమృతాంజనము

## అన్ని నొప్పులకు దివ్యామృతము

1893 నుంచి లక్షలాది ప్రజలు అమృతాంజనం వాడి, ఎంత అమోఘమైన శక్తికలదో తెలుసుకుంటున్నారు. అమృతాంజనంలో వాడే ఔషధాలన్నీ అతి శీఘ్రంగా బాధను పశమింపచేయుటయేగాక, చాలా హాయిని కూడా కలిగిస్తాయి. హాని కలిగించే పదార్థాలేమీ లేవు కూడా. దగ్గు, జలుబు మొదలైనవి కూడా శీఘ్రంగా ఉపశమిస్తవి. అమృతాంజనం దగ్గర ఉంటే మీ రెటువంటి బాధనైనా జయించవచ్చు.



# అన్నయ్యా

## "పద్మావతీ గంగాధర్"

అన్నయ్యా!

నిన్ను 'అన్నయ్యా' అనటం నాకు మహాయిష్టం. నిన్ను అన్నయ్యా అని హృదయపూర్వకంగా, నోరారా పిలువాలని ఎంతగానో అనుకొంటూంటా. నిద్రలో పిల్చి తృప్తి పడుతూంటా నేమో కూడాను. 'ప్రియమైన అన్నయ్యా' అని ఎందుకు సంబోధించలేదనే సందేహం. నీకు కల్గవచ్చు. నిన్ను ఆ మాటలతో బంధించటం, బంధింపబడటం నాకు యిష్టంలేదు. ఎందుకనోగాని అన్నయ్యా, బంధనాలతో బంధింపబడటం నాకు యిష్టముండదు. భయంవల్లనేమోనని నీవనవచ్చు. కాని బంధనాలలో యిరుక్కుపోయిన వ్యక్తి కొంతవరకు తన వ్యక్తిగత స్వాతంత్ర్యాన్ని కోల్పోతాడేమోనని నా అనుమానం. అది నా మూఢనమ్మకం కూడాను. అతను స్వతంత్రించి, ఖచ్చితంగా ఏపనీ చేయలేడు. అలాంటి బంధనాలలోకూడ ఎంతో ఆనందం యుండుండవచ్చు. కట్లను తెంపుకోపోలేక పోవటంవల్లనైతేనేమి, మరేకారణంవల్లనైతేనేమి, బంధనాలలోని బాధ్యతలలోనే, ఆనందం ఉందనుకొని, అతను తృప్తిగా బ్రతుకగల్గటమనేది, అతని గొప్పతనమనే చెప్పాలి. కాని నాకు అలాంటి శక్తిలేదు. నేను వట్టి అలసత్వుడ నన్నయ్యా.

నేను నీదగ్గరకువచ్చి "అన్నయ్యా" అని పిల్వటం జరిగితే, నీవాశ్చర్యపోవచ్చు. అంతస్థులలో భేదంవల్ల సమాజంలో నీకున్నస్థానంవల్ల, కనీసం సమాజంకోసమైనా, నీ తాత్కాలిక గౌరవమర్యాదలు కాపాడుకొనటానికైనా "ఎవడవురా నీవు" అనవచ్చు. నాకు తెల్సునన్నయ్యా. హృదయపూర్వకంగా నీవెప్పుడూ అలాచేయలేవు. నీవలాంటి వ్యక్తివిగావు. కాని మానవుడు పరిస్థితులకు బానిసన్నయ్యా. చాలసార్లు యిష్టంలేకపోయినా, చాల పనులు చేయవల్సివస్తుంది. చేస్తాడుకూడాను.

ఇదివరకు, పెళ్ళిగాకపూర్వం-అంటే నేను నిన్ను మొదట్లో చూచినప్పుడు ఎంతో సరదాగా, నిశ్చింతగా, నవ్వుతూండేవాడివి. మొన్న నిన్ను నిజంగానే గుర్తుపట్టలేకపోయానన్నయ్యా. నీవు మొన్న పట్నంవెళ్ళుతున్నప్పుడు, మీ కారులోనుండి, నీ బెడ్డింగు, సూటుకేసు తెచ్చి, రైలులో పెట్టింది నేనే. అప్పుడు నీవు రూపాయినోటు యిచ్చావు. 'చిల్లరలేదు బాబూ' అన్నాను. "ఎవడవురా, పిచ్చోడిలా గుండావు" అని నవ్వావు. "పిచ్చోడిలాగుండావు" అన్న విధం, నీవు నవ్వినపద్ధతి, నాకెంతో పరిచయమున్నట్లనిపించింది. కాసేపు ఆలోచించి, నీవైయుంటావనుకొని బయటకు మీ కారుదగ్గరకు పరుగుత్తా. మీ డ్రైవరు ప్రక్క హోటల్ లో కాఫీ త్రాగటానికి వెళ్ళాడనుకొంటా. వచ్చేవరకుండి "ఆబాబు ఎవరుబాబూ" అన్నాను.

"పోరా...." అన్నాడు.

"కాదుబాబు చెప్పండి. చాలమంచివారులాగున్నారు"

"నీకెందుకురా... డబ్బులు బాగాముట్టాయా ?"

"అదికాదుబాబు. నేను యిదివరకు ఒకరియింట్లో పనిచేసా. ఆయింట్లో 'సురేషు' బాబని వారి పెద్ద అబ్బాయిగారుండాలి. అయనేనేమోనని...." అన్నా ఎంతో ఆశతో.

"అవునవును. ఆయనగారే" నన్నాడు.

వెంటనే ఎంతో ఆత్రుతతగా నీవిషయాలన్నీ కనుగొన్నానన్నయ్యా. అతను నీ అడ్రసు యివ్వబట్టే, యిప్పుడీ ఉత్తరం వ్రాసి నిన్ను విసిగిస్తున్నా. విసుక్కోకన్నయ్యా, నవ్వుతున్నావుగదూ! నీ ఆకారంలో మార్పువచ్చినా, నవ్వులో మట్టుకు పెద్దిమార్పేమీ రాలేదు. కాని దానిలో పూర్వం బాధ్యతారహితంగా ఉన్నప్పుడంత, 'ఆకర్షణ' లేదనిపిస్తుంది.

అదికాదు, కానన్నయ్యా, మీ తమ్ముడిలో ఎక్కువ మార్పు వచ్చినట్లులేదే. కాకపోతే మనిషి కాస్త బల్సాడు, అంతే. ఒకవిషయం వ్రాయాలనుంది. వేరుగా తలంచకన్నయ్యా! మీ తమ్ముడు యీమధ్య పట్నంనుండివచ్చిన బండి దిగాడు. పెట్టె, బెడ్డింగు నేనే బైటకు మోసుకొని వెళ్ళా. పావలా యిచ్చాడన్నయ్యా. చాల బరువుగాకూడ ఉన్నాయి. "చాలబరువు, ఆరు అణాలిప్పించండి బాబు" అని అడిగా. నేరు గుర్తించాను. అతను గుర్తించలేదు. "పోరా, తలకూలి పావలాయే గదరా; అసలు నీ లైసెన్సు చూపించు" అంటూ 'లా' మాట్లాడబోయాడు. నాకు లైసెన్సు ఎక్కడిది? నేనూ దొంగనే. దొంగగానే బ్రతుకుతున్నా. అందువల్లే భయపడి నోరుమూసుకున్నా.

"యీపిచ్చోడు ఎవడురా" అనుకొంటున్నావుగదూ, అన్నయ్యా, నీవు నన్ను పూర్తిగా మర్చిపోయియుంటావు. నీవు B. A. ఆఖరు సంవత్సరం చదువుతూండగ, నేను కాలేజీలో చేరాను. హాస్టలులో నీగది ప్రక్కగది నాకు యిచ్చారు. మొట్టమొదటనే నా గదిలోనికి కాలుపెట్టినప్పుడు చూసింది నిన్నే. పలుకరించింది నీవే. చివరకు గదితాళంతీయటంచేతగాలేదు. భయంతో నీవేవచ్చి తీసావు. "బిడియపడకు బ్రదర్" అంటూ ఎంతో సరదాగా, కల్పుగొల్పుగా, నన్ను సంతోషపెట్టటానికి ఎన్నో కబుర్లు చెప్పావు. నీకేమి కావల్సివచ్చినా నన్ను అడుగు" అంటూ ఎంతో స్నేహభావాన్ని చూపెడుతూ నాగదినుండి బైటకు వెళ్ళిపోయావు. నీవు చూపిన ఆనాటి సహకారం నేనెన్నటికీ మర్చిపోలేనన్నయ్యా. అదే నా జీవితంలో మొదటసారి, అలాంటి అనుభూతిని పొందటం. "నాకు అలాంటి అన్నయ్య ఉండకూడదూ!" అనుకున్నా. నేనే గాదు, నీతో కొద్దిగా పరిచయమున్నవాళ్ళు ఎవ్వరూ నిన్ను మర్చిపోలేరు. నీవంటే అంత యిదిగాఉంటారు, అంతాను.

నాకు యిప్పటికి బాగా గుర్తుంది. ఆ విషయం నాకు తెల్సునని యీనాటివరకు నీకు తెలియదనుకుంటా. నీవు యింకా కొంతమంది ఉన్నవారిబిడ్డలు, అంతాకల్సి తిరుగుతూండేవారు. వాళ్ళకూ, నీకు ఎంతో తేడా ఉందనిపించేది నాకు. వాళ్ళందరు అవకాశవాదులనుకొంటూండేవాడిని. వాళ్ళంటే నాకు చాల హేయభావముండేది. క్షమించాలి అన్నయ్యా. వాళ్ళతో నాకు నీకున్నంత పరిచయంలేదు. ఉన్న పరిచయంతో, యిలా నిష్కర్షగా వ్రాస్తున్నందుకు మన్నించు అన్నయ్యా. అన్నం వుడికిందో, లేదో, తెల్సుకొనటానికి అన్నమంతా పట్టుకొనిచూడాలా? నిన్ను పొగడి పైకిఎత్తాలనిగాని, ఎదో స్వబుద్ధితోగాని యిలా వ్రాయటంలేదు. నేనలాంటిక్షుద్రుడ్ని కానన్నయ్యా. వాళ్ళు నిజంగానే అలాంటివారు. నీముందు, ఎంతో యిదిగా మాట్లాడుతుండేవారు. చాటుగా 'సురేషు' అలాంటివాడు, యిలాంటివాడని ఎన్నో అనేవారు. అలాంటి దొంగబుద్ధే నాకు గిట్టినది. నా చెవులతో నేను విన్నానన్నయ్యా. అందుకనే వాళ్ళంటే నా కసహ్యం. చదువుకు, విజ్ఞానానికి ఎచ్చటైనా సంబంధం ఉందా అని నేను యిప్పటికీ ఆలోచిస్తూంటాను. చదువుకొనటం వేరు. జ్ఞానంకల్గి, తోటివారిని అర్ధంచేసుకొని కల్సి, మెల్సి బ్రతకగల్గటం వేరనుకొంటాను. నీవు ఒక పనిచేసావని, అది వాళ్ళందరకూ ఎంతో తలవంపులు తెచ్చినట్లు, ఆ మేకపోతు గంభీరులంతా నీతో మాట్లాడటం తగ్గించారు, మూకీభావంగా ఉండటం మొదలుపెట్టారు. గుర్తున్నదా అన్నయ్యా. ఇవిఅన్ని వ్రాస్తున్నందుకు వేరుగా తలంచకన్నాయి. తీగలాగితే డొంకంతాకదలినట్లు. యీరోజు నా హృదయమంత బాధపడుతూంది. గతం అంతా గుర్తుకొస్తూంది. నీవు గుర్తుకొచ్చినప్పుడల్లా ఎందుకనోగాని, నాకళ్ళు చెమ్మగిలుతాయి. నీవొక రోజున నీ గదిలో ఉండే రాముతో "ఎందుకు మీరంతా అలా నేనంటే మూకీభావంగా ఉంటున్నారు......ఎవ్వరెలా ఉన్న నేను లెక్కచేయను. నీవుమట్టుకు...." అని రుద్ధకంఠంతో అంటుండగా వరండాలో కూర్చొనిఉన్న నేను విన్నాను. అలా వినటం తప్పు అయితే, క్షమించు అన్నయ్యా. నేను ఎప్పుడూ ఎచ్చటకూ వెళ్ళకుండ, అచ్చటనే నాగదిముందే, ఏదో చదువుకొంటూనో, ఆలోచిస్తూనో కూర్చునుండేవాడిని. అంతేగాని మీమాటలు వినాలనిగాదు. నీకు హృదయముందన్నయ్యా. ఎవ్వరైనా కష్టాలలో ఉన్నారని తెల్సినా, బాధపడుతున్నారని తెల్సినా, నీవు కన్నీరు కారుస్తావు. ఎంతో యిదవుతావు. నీలాంటి భాగ్యవంతుల బిడ్డకు అలాంటి అవుసరముండదు. నేను ఉన్నవారి పిల్లలలో నీలాంటివాని నెచ్చటా చూడలేదు. అన్నయ్యా డబ్బున్నంతమాత్రాన మానవుడు, ఆందరిచే గౌరవింపబడతాడనిగాని, ప్రేమింపబడి పూజింపబడతాడనుకొనటంగాని చాల తెలివితక్కువతనం. అది అంతా అజ్ఞానులకు సరిపోతుంది. డబ్బుకు మానవత్వానికి సంబంధం ఎక్కడుందన్నయ్యా. మానవుడై పుట్టినంతమాత్రాన, అతనిలో మానవత్వం పూర్తిగా ఉంటుందంటే నేను నమ్మను. మానవుడు స్వార్ధజీవి, అందువల్లనే చాల విషయాలు చాల సంకుచితంగా ఆలోచిస్తూంటాడు. వాళ్ళుకూడ నీ విషయంలో అంతే చేసారు. వాళ్ళకు అలాంటి అవకాశం రాలేదుగాని, వస్తే వదలిపెట్టేవారంటావా? స్నేహం కొద్దీ నీవు వాళ్ళను వెనుకేసుకొని రావచ్చుగాని, నేను మట్టుకు నమ్మను. 'ఆ అమ్మాయి' మంచిదిగాదని, ఆ అమ్మాయితో స్నేహం చేసావనేగా, వాళ్ళందరకు అభిమానం పొడ్చుకొచ్చి, నీతో మాట్లాడటం మానివేసింది; సమ్మె చేసిందీను. ఈ ప్రపంచంలో మంచి, చెడ్డల నిర్ణయం చేసేదెవరు? చేయగల్గిందెవరు? ఆసలు శుద్ధులు, బుద్ధిమంతులెవరైనా ఉన్నారా అనే నా ఆనుమానం. మనం, మన దృష్టితో, మన స్వార్ధంకొద్ది, 'అది మంచి యిది చెడు అంటాము. మన ఆలోచనలతో ఏకీభవించనివారెంతమందో ఉంటారు, అలాంటప్పుడు యిదమిత్థంగా మంచి చెడుల నిర్ణయాలుచేయటం సాధ్యమా? చూడకుండగనే ఎవ్వరో గిట్టనివాళ్ళు చెప్పిన మాటలువిని, ఆలోచించనైనా, ఆలోచించకుండా, ఒక నిండు ప్రాణాన్ని పట్టుకొని ఆడిపోసుకొనటం, ఆమె ముక్కు మొఖం, తెలియకుండానే, ఆమెనుగూర్చి చిలువల, పలవలగా చెప్పకొని, ఆడిపోసుకొనటం, సబబా? చదువుకొన్నవారు విజ్ఞానులు చేయవల్సినపనేనా? ఒక వ్యక్తి యింకొక వ్యక్తితో స్నేహంగా ఉండకూడదా? కష్టసుఖాలు, వెళ్ళగక్కటానికికూడ నోచుకోలేదా? మానవుడు, తనను నిష్కల్మషంగా, నిస్వార్ధంగా అర్ధంచేసుకొనగల మరొక మానవహృదయం కొరకు వెతుకుతూంటాడు. అలాంటి హృదయాన్ని పొందగల్గినప్పుడు, ఎలాంటి మూగ హృదయమైనా, కడుపు చించుకొని, బావురుమని, బాధలన్నిటిని కక్కుతుంది. అంతేగా. అదేగా మీ యిద్దరకూ సంబంధం.

ఇప్పుడు నేనెవరో నీకు గుర్తువచ్చిఉంటానుగాదన్నయ్యా. మాసిపోయిన, చిరిగిపోయిన బట్టలతో, ఎక్కువగా ఎవ్వరితోను మాట్లాడకుండా, ఏదైనా అడిగినా, పిచ్చివానిలా అన్నిటికి సమాధానంగా నవ్వుతూ పోయేవాడికి, యిన్ని ఆలోచనలున్నవా? అని నీవు ఆశ్చర్యపడవచ్చు. దేనికైనా సమయం రావాలన్నయ్యా. చంద్రునికి సముద్రానికి సంబంధమేమిటి? కన్నె హృదయానికి పండు వెన్నెలకు చుట్టరికమేమిటి? అలాంటిదే మానవ హృదయం కూడాను. ఆ హృదయ తంత్రీనాదం వినాలంటే, మీటే వ్యక్తి దొరకాలి. ఆవ్యక్తి సరిగా మీటకల్గితే, ఆ హృదయ స్వరాన్ని అనేక రూపాలలో వినగల్గుతాడు. అంతవరకు మానవుడు మూగవానిగానే బాధపడుతూంటాడు. తనలో, తానే, ఆలోచనలతో, నిరుత్సాహ, నిస్పృహలతో; సతమతమవుతూంటాడు. చాటు, మాటుగా కన్నీరు కార్చటమేగాదు, హృదయ భారాన్ని తగ్గించుకొనటానికి ఆవురుమని ఏడుస్తాడుకూడాను. ఆహృదయం అతిసున్నితమైనదైతే, అన్యాయ, అక్రమాలను చూసి భరించలేక బ్రద్దలైపోవచ్చుకూడ. మానవ సమాజాన్నుండి విడిపోయి, పిచ్చివాడై

శాశ్వతశెలవు పుచ్చుకొనవచ్చుకూడ. పుట్టిన ప్రతి మానవునకు, హృదయం ఉండవచ్చు, కాని ఎదుటివారి బాధలు, కష్టసుఖాలు అర్థంచేసుకొనగలవాళ్ళు చాల తక్కువమంది ఉంటారు. బాధలను అర్థంచేసుకొని, బాధపడి కన్నీరుకార్చగల హృదయమే ప్రేమించగల్గుతుంది. ఆహృదయం ఎంతసున్నితమైతే, అంతగా, అన్యాయాలకు, అక్రమాలకు దుఃఖించగల్గుతుంది; అంతగా ప్రేమించగల్గుతుందికూడాను. నీవలా బాధపడేవాళ్ళలో ఒకడవన్నయ్యా, అయినా మానవుడు. యీజీవితంలో, చేయకల్గింది, సాధించవల్సినది ఏముంది చెప్పు? ప్రేమించి. యితరులతో ప్రేమింపబడకల్గితే, అతని జన్మ సార్థకమైనట్లే. కానలాంటి మహానుభావులెంతమంది ఉంటారన్నయ్యా?

నేను ఎవ్వరినో, యిప్పుడు బాగా గుర్తొచ్చిఉండాలి. నాసంగతడుగుతున్నావా అన్నయ్యా? చెప్పటానికేముంది? పుట్టిన ప్రతివ్యక్తి ఒకనాడు గిట్టకమానడు. ఈ మధ్యకాలంలోనే, అతను సల్పే పోరాటాలు, ఆడే నాటకాలు. నేను వట్టి అసమర్థుడనన్నయ్యా. ఏపనీ మనస్సు కేంద్రీకరించి చేయలేను. నాకొరకు ఎవ్వరినీ చేయిచాచి అడుగనూ లేను. నీకు తెల్సునోలేదో, నాకు అయిదు సంవత్సరములు నిండకపూర్వమే అమ్మా, నాన్న, పోయారు. నేనూ, వాళ్ళు నాకొరకు మిగిల్చివెళ్ళిన ఎకరం పొలం మిగిలాయి. యీలోకంలో నన్ను మా మేనమామ తీసుకొనివెళ్ళి పెంచి పెద్దవానిని చేసాడు. నాకు బాగా మార్కులు వస్తూండటంవల్ల, డబ్బులేకపోవటంవల్ల, వూళ్ళోవారు చందాలువేసి జీతం కడుతూండేవారు. ఊళ్ళోనే స్కూలుండటంవల్ల, స్కూలుఫైనలువరకు చదివాను. స్కూలుఫైనలులో ఫష్టున వచ్చాను. ఆతరువాత అందరి ప్రోత్సాహంవల్ల, యింటరులో చేరాను. అప్పుడే నిన్ను కల్సుకొనటం జరిగింది. జీవితం, మనం అనుకొన్నంత, ఆశించినంత, సాఫీగా నడ్వదనుకొంటాను. ఒడిదుడుకులు లేకపోతే, దానిలో అందమే ఉండదేమో! జీవితం అంతులేని అఘాతంగా తయారై ఉండేదిగాదేమో! మా మేనమామకు ఒక కూతురుంది. ఆ అమ్మాయి పెళ్ళీడుకొచ్చింది. మా మేనమామ, మేనత్త నన్ను చేసుకొనమని బలవంతం చేసారు. నాకు ఆ అమ్మాయినిగురించి ఎలాంటి చెడు అభిప్రాయమూ లేదు; కాని నాకు పెళ్ళంటే ఆనాడు యిష్టంలేదు. సరిగదా, యీనాటికికూడ అలాంటి అభిప్రాయమే ఉందన్నయ్యా. అసలు నాలాంటివాడికి పెళ్ళేమిటి పిచ్చిగాకపోతే, పెళ్ళిచేసుకొనటం. నానాకష్టాలుపడటం, పిల్లలను కనటం, మళ్ళీ ఆపిల్లలకు పెళ్ళిళ్ళుచేయటం—యిలా కనటం, కన్పించటానికే ననుకొంటూ, అసలు మానవుడు పుట్టింది. అందుకనే కాబోలు. పది అబద్ధాలాడి ఒక పెళ్ళిచేయమన్నారు పెద్దలు. అలాంటి గమ్మత్తైన ఉద్దేశ్యాలతోనే నేనసలు పెళ్ళిచేసుకొనదల్చనిది. నన్ను నేనేపోషించుకోలేని అసమర్థుడ్ని. నా మెడకొక డోలెందుకన్నయ్యా? "తాతా పెళ్ళిచేసుకొంటావా?" అంటే, "నాకెవరిస్తారురా?" అనే మానవ సంతతివాడనైన నాకు యిలాంటి దుర్బుద్ధి. తిక్క, తిక్క, ఆలోచనలు ఎందుకు అని అంటున్నావా? అన్నయ్యా. మొన్న, ఈమధ్యఒక అమ్మాయి రోడ్డుప్రక్కన చచ్చిపడుంది. ప్రక్కన చిన్నబిడ్డ ఎంతో ఉల్లాసంగా ఆడుకొంటున్నాడు. ఆమె ఆపసిబిడ్డ పాలుత్రాగుతుండగనే ప్రాణంవిడిచింది. పాపమాపసికందు కదేమి తెల్సు. ముందు, ముందు, తెల్సినప్పుడతనికి ఎలాంటి ఆలోచనలు కల్గుతవో, ఎలాంటి ఊహాలతో సతమతమవుతాడో? అతని అదృష్ట మెలావుందో? ఆ అమ్మాయి నొకడు మోసపుచ్చాడు. తరువాత చెప్పకుండా ఒకనాడు ఎలావచ్చాడో, అలాగే ఆ అమ్మాయిని వదలివెళ్ళాడు; అంతే. ఆ అమ్మాయి అడుక్కొని బ్రతుకుతూండేది. వడదెబ్బకు, తిండిలేకపోపటంవల్ల, జానెడుపొట్టకు, అణా, బేడకుకూడ కక్కుర్తిపడే, ఆఅమ్మాయి, ఆనాడలా శాశ్వతంగా శెలవు పుచ్చుకొంది. అది గుర్తుకొచ్చినప్పుడల్లా, నేను చాలమంచి పని చేసానేమోననిపిస్తుంది. నేనుకూడ పెళ్ళిచేసుకొన్న తరువాత, అకస్మాత్తుగా చనిపోవటం జరిగితే, నా భార్య పిల్లల బ్రతుకుకూడ అంతే అయ్యేదిగదా అనిపిస్తుంది. ఆపసికూనను అనాధ శరణాలయంవాళ్ళు తీసుకొనివెళ్ళారు. ఆ అమ్మాయిని మున్సిపాల్టీవాళ్ళు తీసుకెళ్ళారు. ఈ దేశంలో అడుక్కొనేవాడవ్వవల్సిందేగదా! అన్నయ్యా, నీవు, ఎన్నిచెప్పినాసరే, అనేక ఆర్థిక సూత్రాలను, వల్లెవేసినవి ఏకరవు పెట్టవచ్చు. కాని మానవ ప్రవృత్తిలో మార్పు రానంతకాలం, మన సాంఘిక వ్యవస్థ యిలానే ఉంటుంది. ఎవ్వరికివాళ్ళు, స్వార్థంతో, భయంతో, దొంగలలా బ్రతుకవల్సినదే. పాలించేవారు అంతా దొంగలైనప్పుడు, న్యాయమెక్కడుంటుంది? దొంగలు దొంగలు వూళ్ళుపంచుకొన్నట్లుఉంటుంది. మానవప్రవృత్తిని, ఎప్పుడో, తరతరాలనాడే శంకించారు. అందుకనే, యీ న్యాయశాస్త్రాలు, న్యాయస్థానాలు, నీతిసిద్ధాంతాలు ప్రపంచంలోకి వచ్చాయనిపిస్తుంది. వైజ్ఞానికంగా ఎంతో ముందుకు వెళ్ళామనుకొన్నా, తర, తరాలనుండి వస్తున్న మానవ ప్రవృత్తిలో మార్పేమీ లేదనిపిస్తుంది నాకు. అలాంటి ఉద్దేశ్యాలతోనే పెంచినవారి మాటకాదని. వాళ్ళను బాధపెట్టి, ఉన్న ఎకరంపొలం అమ్మి డబ్బు వాళ్ళకిచ్చి దేశం మీదపడ్డాను. అతరువాత ఆకుటుంబవిషయాలేమీ నాకు తెలియవు. నేను వాళ్ళనుగూర్చి వేరుగా చెప్పటంలేదు. నన్ను పెంచిపెద్దవానిని చేసారు, ఆలోచించుకొనటానికి శక్తిసామర్థ్యాలు, అనుకొన్నట్లుగా నడ్వటానికి ధైర్యసాహసాలు కలుగజేసారు. దానికి ఎంతో ఋణపడియున్న నేను వాళ్ళనుగూర్చి వేరుగా తలంచినా, చెప్పినా, ఆ పాపంనుండి ఏనాడూ విముక్తుడను కాలేను. అంతే, ఆ నాడు అలా కట్టుబట్టలతో ఎవ్వరికీ చెప్పకుండా. ఆ నీడను వదలాను. ఏకాకిగా జీవితయాత్ర సాగించమొదలెట్టాను. పుట్టిన ప్రతి వ్యక్తికి ప్రపంచంలో బ్రతకటానికి, ఎచ్చటో ఒక చోట, అవకాశం, ఆస్కారం ఉంటుందని నా నమ్మకం. ఎక్కడ, ఎంతచోటు, ఎలాంటి ఆస్కారం అనేది వేరే ప్రశ్న. బ్రతుకదల్చటంవేరు, బ్రతకటానికి మార్గం తెల్సు

కొనగల్గటం వేరనుకొంటూనన్నయ్యా. నేను బ్రతుకదల్చానే గాని, బ్రతుక నేర్వలేదు. అన్నిరకాలపనులు చేస్తూంటాను. మంచీ, చెడూ, చేయతగనిపని, చేయరానిపని అనే భేదం లేదు. నా చేతులమీద నేను బ్రతుకుతున్నాననే తృప్తి మట్టుకు నాకుంది. నీగూర్చి అంటే, నేను బ్రతికే విధానాన్నిగూర్చి ఎప్పుడూ ఆలోచించలేదు. విచారించనుకూడాను. కూలి, నాలి పనులు చేస్తూంటాను. కూలివాళ్ళ పిల్లలకు చదువులు చెబుతూంటాను. ఇచ్చేవాళ్ళు యిస్తారు, లేనివాళ్ళులేదు. నాకు బాధలేదు. నాల్గుడబ్బులు చేతిలో పడగనె; మకాంఎత్తివేస్తా. స్వేచ్ఛాజీవిగా తిరుగుతుంటాను. "అలా బ్రతకటంకూడ ఒక బ్రతుకేనా" అంటున్నావా అన్నయ్యా? అలా అనకన్నయ్యా. నేను మీ నాగరికతా ప్రపంచంలో పనికిరాని, బ్రతుకలేని వ్యక్తినన్నమాటమట్టుకు నిజం. మీ నాగరికతనుగూర్చి మురిసి మీరు ముగ్ధులవ్వవలిసిందే. ఎంత నటనప్రాయంగా మనుష్యులు బ్రతుకుతుంటారో తెల్సుకొంటే, చాలఅసహ్యం పుడుతుంది. ఒకొకసారి మానవులు కాదు, వీళ్ళు దానవులనిపిస్తుంది. నిజమో, అబద్ధమోగాని మొన్నొక కూలి చెప్పాడు—ఒకఅత్త, కొడుకులేని సమయంలో కోడలికి నిద్రపోతుండగ, కిరుసనాలుపోసి అర్ధరాత్రి కోడలికి నిప్పెట్టిందట. గల్లంతుకు చూడటానికి వచ్చినవాళ్ళతో, కోడలే, ఆత్మహత్య చేసుకొనటానికి, కిరుసనాలు పోసుకొని నిప్పెట్టుకొందన్నదట. అదే సత్యమైతే. ఏమనుకోవాలి? ఆమెకూడ నాలానే, యీ సమాజంలో వ్యక్తిగా బ్రతుకుతూంది. నిజానికి ఆమెకున్న గౌరవం నాకు లేదని తెల్సు. మా యిద్దరకు ఒకేస్థానముందంటావా యీ సమాజంలో? అమెకు బ్రతకటానికి హక్కుందిగాని నాకు లేదా? ఏదో సోది వ్రాస్తున్నానన్నయ్యా. ఏమిచేయమంటావు? తల్చుకొంటె హృదయం బావురుమంటుంది.

అన్నయ్యా, నీకు తెలియనివిషయం మరొకటి చెప్పనా? నీకు తెల్సుకోనాలనుండకపోవచ్చు. జీవితంలో కొందరి వ్యక్తులను చూస్తాము. వాళ్ళకూ, మనకూ పరిచయం లేకపోయినా వాళ్ళను మర్చిపోలేము సరిగదా, వాళ్ళను తెల్సికొని వాళ్ళు కన్పించినప్పుడు "ఫలానవ్యక్తి....అతని పేరు గుర్తులేదు...అలా ఉండేవాడు...యిలాఉండేవాడు" ఎన్నో గుర్తులుచెప్పి. మంచీ, చెడూ తెల్సుకోన ప్రయత్నిస్తాము. ఎందుకని? వాళ్ళకు మనకు సంబంధం ఏమిటి? దానికి సమాధానముండదు. "ఊరకనే" అంటాము. చాల స్వాభావికంగా అలాగే 'నిన్ను'గాని, "ఆ అమ్మాయి"ని గాని చూసినవాళ్ళు మర్చిపోలేరు.

"ఆ అమ్మాయిని" నేనొకసారి నీ ప్రియమైన స్నేహితులైన వారిలో, ఒకరితో చూసాను. ఆమెను చూచిన కొలది చూడబుద్ధవుతుంది. ఆమెలో అలాంటి, ఆకర్షణ, చలాకితనం, నిరాడంబరమున్నాయని చెప్పాలి. ఆమెను గూర్చి చెడుగాచెప్పి, ఆమె జీవితం నాశనంచేయబూనటం. చక్కని గులాబీపువ్వును; ఓర్వలేనితనంకొద్ది, ముళ్ళగుచ్చుకొన్నవనే కోపంతో, కజ్జితో కొట్టి నాశనంచేయటంలాంటిదనుకొంట. ఆ నీ స్నేహితుడు, ఆమెను తనతో రమ్మని, ఎంతో ప్రాధేయపూర్వకంగా అడుగుతున్నాడు. అతనిమాటలు వింటే అతడామెను, ఎంతగానో ప్రేమిస్తున్నాడనిపిస్తుంది. కాని అవి ఏమీ, ఆమె చెవికెక్కినట్లు లేదు. అలాంటి మాటలు వినటం ఆమెకు పరిపాటైనట్లు ఆమె ముఖాన్నిబట్టి తెలుస్తుంది. "నన్ను ఎందుకు వేధిస్తావు?...నాకు యిష్టంలేదు. నాకు యిష్టమేఉంటే, నీ సాంగత్యం కొరకు ప్రాధేయపడేదానను" అని కొద్దిసేపు తరువాత "సురేషు నీకు తెల్సననుకొంటాను. పాపం! ఆనాడందరూ అతనిని ఆడిపోసుకొన్నారు. నిజానికతను పర్తి అమాయకుడు. ఏపాపం ఎరుగడు. నేనే అతని స్నేహాన్ని కోరింది. అతనుగాదు. నేనతని స్నేహాన్ని కోరింది, అతనికి డబ్బుందని కాదు. అతనికి మీకెవ్వరికీ లేని హృదయముంది. మీరతను చెడిపోయాడనుకొంటే చెడగొట్టింది నేనే. మీరతను చేయరాని పాపం, తప్పు, చేసాడనుకొంటే, దానికి కారణం నేనే. అతను మాయింటిముందుగా వెళ్ళుతూండగా తరచు చూస్తుండేదానను. అంతకుముందు పురుషులంటే నాకు చాల హేయభావముండేది. స్వార్థపూరితులుగా, నికృష్టులుగా విలువకడుతుండేదానను. దానికి కారణం నాగతం కావచ్చు. కాని అతనిని చూచినప్పటినుండి నాకు తెలియకుండగనె నాలో ఎంతో మార్పువచ్చింది. నేనెంతవరకు తెగించానో తెల్సుకొంటె, నీ వాశ్చర్యపడవచ్చు. అతనెప్పుడూ మీకు చెప్పుండడని నాకు తెల్సు. ఒకరోజున తను సినిమాకు వెళ్ళటం చూసాను. ఏదో పనిమీద బజారుకు రిక్షామీద బైలుదేరిన నేనుకూడ సినిమాకువెళ్ళాను. ఆనాడేమంత జనసమ్మర్ధంగా కూడలేదు. హాల్లో, సురేషు ఒకమూల వంటరిగా కూర్చొనిఉన్నాడు. ఏమీఎరుగనట్లుగా నేనూ వెళ్ళి అతని ప్రక్కసీటులో కూర్చొన్నా. ఆతరువాత కొద్దిసేపటికి సినిమా మొదలుపెట్టారు. ప్రక్కప్రక్కన కూర్చొనటంవల్ల, కుర్చీ చేతులపై మేము యిద్దరం చేతులు పెట్టుకొనబోయినప్పుడు; ఒకరిచేతులొకరికి తగిలాయి. కొంతసేపు తరువాత సురేషు లేచి వెళ్ళబోయే ప్రయత్నంలో ఉండగా, అతని చేతిని నాచేతిలోనికి తీసుకొన్నాను, నాచేయి వణకుతూ ఉంది. నాచేతిలో అతనిచేయికూడ వణకుతూనేఉంది. కాని ఎవ్వరం మాట్లాడనూలేదు. చేతులు వదలివేయనూ లేదు. నెమ్మదిగా, మృదువుగా, అతనిచేతిని నొక్కాను. కాని అతనిలో మార్పేమీలేదు. తరువాత నా చేతిని తీసుకొన్నా చిరుకోపంతో. కొద్దిసేపు తరువాత, చాల అమాయకంగా అతను నావంక చూసాడు. నేను చూడనట్లుగా వూరుకొన్నాను. అలాఉండిపోయినా పోయేది. ఉండలేకపోయాను. చిరునవ్వు నవ్వుతూ, మరలఅతని చేతిని నాచేతిలోనికి తీసుకొన్నా. ఈసారి, నా వ్రేళ్ళలోనికి తన వ్రేళ్ళు పోనిచ్చి చాల మృదువుగా నొక్కాడు. అతనలా తన అంగీకారాన్ని, అనురాగాన్ని చూపినక్షణం యీనాటికి మర్చిపోను. అదే మాయిద్దరి కథలో మరువలేని, మరపురాని ఘట్టం. నేను పట్టరాని ఆనందంతో, అతనిచేతిని నా తొడ

మీదుంచుకొన్నా. ఆ తరువాత నా శరీరమే అతని సొత్తయ్యింది. ఆ రాత్రి మేము యిద్దరం కల్సి మాయింట్లోనే గడపాము. చాలతొందరగా తెల్లవారిందని ఎంతో బాధ పడ్డాము. ఆనాడు నాకతను భాగ్యవంతుల బిడ్డని తెలియనే తెలియదు. అతనిలోనున్న ఆకర్షణేదో నన్నలాచేసింది. అంతే. తరువాత కథ నీకు తెల్సుననుకొంటాను. మా యిద్దరి సంబంధాన్ని చిలువల, పలువలగా వీరంతా కల్సి ప్రచారంచేయటం, వాళ్ళ పెద్దవాళ్ళు చదువు మాన్పించి పెళ్ళి చేయటం నీకు తెల్సినవేగా. ఆతరువాత "సురేషు" స్నేహితులు ఎలాంటి వంకలు పెట్టుకొని నావద్దకు వస్తూండే వారో, వాళ్ళ, వాళ్ళ కోరిక లెలా వెళ్ళబుచ్చుతుండే వారో, తలంపుకొచ్చినప్పుడల్లా నవ్వొస్తుంది. "సురేషు"తో ఏస్త్రీ అయినా సుఖపడుతుంది; అతని సుఖం మా కెలావున్నా, ఆతరువాత అతనిని చూడటంగాని, కనీసం అతనినిగూర్చి వినటంగాని జరుగలేదు. అతనెక్కడున్నా, నాకు కావల్సినది, నేను కోరేది అతని సుఖమే. నేనేమీ నీగతాన్నిగూర్చి, అతనితో గడిపిన రోజులనుగూర్చి విచారించటంలేదు. అవి నీ జీవితంలో మధురక్షణాలు. నా కన్యాత్వంలోని ఆనందాన్ని, అతనికర్పించి,' అతనితో హాయిగా కొద్దికాలమైన గడ్పగల్గినందుకు జీవితం సార్ధకమైనట్లు సంతోషపడుతూంటాను. ఇప్పుడేముంది నీలో, పైపై పూతలుతప్ప. కోరిక అనేది ఆనాడే చచ్చిపోయింది. జీవచ్ఛవంలా బ్రతుకుతున్నా. అది నాచరిత్ర. నీతోవచ్చి, నీడబ్బుతో బ్రతుకుతూ, నిన్ను ప్రేమిస్తున్నట్లు నాటకమాడుతూండలేను. నేనలా ఎవ్వరినీ మోసగించదల్చుకొనలేదు... ....'' అంటూ ఎన్నో విషయాలు ముఖానకొట్టినట్లు చెప్పింది. అంతనగ్నంగా, మనుష్యులు, అందులో అంత అందమైన, స్త్రీలు అలాంటి విషయాలు, అలా నిర్మొహమాటంగా చెబుతారని, నేను ఊహించనైనా ఊహించలేదు. నేను నాచెవులతో వినకున్నట్లైతే, ఎవ్వరైనా చెప్పిన, నమ్మేవాడనుగాదు. ఆమె మాటలు వింటూంటే నా మనస్సు పరిపరి విధాలుగా పోయింది.

ఇది జరిగి దాదాపు రెండు సంవత్సరాలపైనవుతుంది. ఆమె యిప్పుడెక్కడ ఎచ్చటుందో. లేక చచ్చిపోయిందో, లేక ఎవ్వరైనా చంపి సముద్రంలో పారవేసారో. మరల ఒకసారి ఆమెను చూడాలనిపిస్తుంది. ఒక్కసారి నేనామెతో మాట్లాడే అవకాశంకల్గితే బాగుండును.

ఏదేదో వ్రాసానన్నయ్యా. నీకు విసుగు కల్గించుండవచ్చు. ఏదైనా అసమంజసమైన విషయం వ్రాసి, నీ మనస్సుకు కష్టం కల్గిస్తే క్షమించు అన్నయ్యా. నేను తెల్సి, కావాలని ఎవ్వరినీ బాధపెట్టలేను. ఎవ్వరైనా నన్ను కష్టపెట్టినా, నా కపకారంచేసినా, నాలో ఏదో తప్పుండి యుంటుందని, నేనే బాధపడుతూంటాను. నాలో నేనే మధనపడుతూంటాను; కాని ప్రతీకారం చేయలేను. అన్నయ్యా యీ ఉత్తరం ముగించేముందు ఒక విషయం నిన్ను అడగాలనుంది. నేను చచ్చిపోయానని తెలిస్తే ఒక్క కన్నీటి బిందువైనా కారుస్తావా అన్నయ్యా? ఎందుకనోగాని, అలాంటి అదృష్టానికైనా నోచుకున్నానా, అని అనుమానం వస్తూంటుం దప్పుడప్పుడు. చాల బాధగాకూడ ఉంటుంది. నాకు స్వార్ధంలేదనుకొంటూండేవాడిని, కాని యీ విషయంలోమట్టుకు మనస్సుకు చాల కష్టంఉంటుంది. నేనుకూడ ఏరోడ్డుప్రక్కనో, చచ్చిపోతానని, కాకులూ, గ్రద్దలూ చుట్టూచేరుతాయని, ఆ తరువాత మున్సిపాల్టీ వాళ్ళో, మరెవరోవచ్చి యీడ్చుకెళ్ళుతారని, తలంపుకొచ్చినప్పుడల్లా, చావంటే భయపడని నాకు, చాలభయంగఉంటుంది; కడుపులో ఎదోగాకూడా ఉంటుంది. బ్రతికినంతకాలం నాలాంటి అభాగ్యులకు, అలసత్వులకు, ఎవ్వరూ ఎలాంటి సహాయంచేయకపోయినా, చచ్చినతరువాతనైనా సరిగా దహనసంస్కారాలు చేయించగలవారుంటే బాగుండును. అయినా నాపిచ్చిగానన్నయ్యా, చచ్చిన తరువాత, నేనుయివన్నీ చూడవచ్చానా?

ఇంకా కబుర్లేమిటన్నయ్యా. ఎన్నో విషయాలు వ్రాయాలనుంది. చూస్తేయిలా ఎన్ని పేజీలైన వ్రాయగలననిపిస్తోంది. ఇక ఆపటం నుంచిది. నీకు విసుగెత్తించటం నాకు ఇష్టంలేదు. తప్పులుంటే క్షమించు అన్నయ్యా. క్షమించుతావుగదూ? ఇక ఉంటానన్నయ్యా. శెలవు.

నీ

"తమ్ముడు"

---

"తగినవేసంబు, తనుదాన వొగడు కొనమి
నొచ్చియును గీడువలుకమి, యిచ్చి వగవ
కునికి, తనకెంత నడువకయున్న పథము
దప్పకుండుట నడవడి కొప్పు సేయు"

(మహాభారతము)

# నాగేశ్వర శిశు విహార్

## ఆరవ వార్షిక సభ

### (శ్రీమతి హైమావతి)





జానపద వేషాలతో 'శిశు విహార్' బాలలు.

'నాగేశ్వర శిశు విహార్' యొక్క ఆరవ వార్షిక మహాసభ, ఎప్పటిమోస్తరే, ఈ 13–4–61 తారీఖున శ్రీమతి బాలమ్మాళ్ అగ్రాసనాధిపత్యం క్రింద జరిగింది. ఆతరుణంలో ఆంధ్రమహిళా సభ సంయుక్తకార్యదర్శిని అయిన శ్రీమతి॥ టి. జి. హైమావతి ఈక్రింది నివేదికను సమర్పించింది.

మహిళల విశ్రాంతికయి ఈ ప్రాంతంలో ఆంధ్రమహిళా సభ 'వనితా బాలవిహార్'- ను నిర్మించి జరుపుతున్నది. దీనికొరకు ప్రతినెల ఆంధ్రమహిళాసభ చాదాపు రూ500 -లు ఖర్చుపెడుతున్నది. మాకు మదరాసు నగరపాలకసంఘంనుండికూడ ఏలాటి గ్రాంటులు ఇంతవరకు మంజూరు కాలేదు, ప్రతిచోటా స్త్రీలకును పిల్లలకును ఇట్టివిహారప్రదేశాల అవసరం మిక్కిలి ముఖ్యమయినది. ఇలాంటివి సాంఘికసంబంధంగాను సామూహిక కార్య ప్రోత్సాహకరంగాను అవకాశాలను కలిగింపగలవు, మేము వనితలకై ఒక పఠనమందిరాన్నికూడా నడుపుతున్నాము. మేము స్థానికంగా పిల్లలకు 'భోన్సలే' జాతీయక్రమశిక్షణ విధానాన్ని అమలులో పెట్టవలెనని నిశ్చయించుకొన్నాము. అంతేగాక వారిని వ్యాయామం,— క్రీడలు, పందేలు, జాతీయగీతాలు మొదలగువానిలోను తయారుచేస్తున్నాము. మా ఉద్దేశాలప్రకారం కార్యక్రమాలు కొనసాగేటట్లు పౌరులు శక్తికొలది ఆర్థికంగా తోడ్పడాల్నని కోరుతున్నాము. మా 'వనితావిహారం' స్థాపించిన యీప్రదేశాన్ని నగరపాలకసంఘంవారు 10సంవత్సరాలకు అరువు ఇచ్చారు. ఇందులో— క్రీడావనాన్ని పెంపొందించటానికి, తక్కినకార్యాలు నెరవేర్చటానికి, ఒక బహిరంగనాటకశాల నిర్మించటానికి, పఠనమందిరం ఏర్పరచటానికి— తగులబడి అయ్యే ఖర్చులను పూర్తిగా మేమే భరిస్తున్నాము. మేము చేయుచున్న సత్కార్యాన్ని గుర్తించి— ఈసంస్థను అభివృద్ధిలోనికి తేవటానికిన్ని, స్త్రీలయొక్కయు బాలబాలికలయొక్కయు విద్యాసంక్షేమములు పెంపొందించటానికిన్ని— తగినట్లు ఈప్రదేశంలో మరొకకట్టడం కట్టుకొనుటకు అనుకూలంగా నగరపాలకసంఘంవారు శాశ్వతంగా ఈప్రదేశాన్ని అరువు ఇవ్వాల్నని కోరుతున్నాము. మాకు ప్రజల సహకారం కూడా ఉన్నది. సాంఘిక సంక్షేమ కార్యకలాపాల విషయంలో— ఆంధ్రమహిళాసభ ముఖ్యంగా ముందంజ వేస్తూంటుంది. ఆవిషయం సామాన్యజనులు కూడ ఎరిగిందే, కొన అట్టివారు తోచిన విరాళాలను ఇవ్వటానికి వెనుదీయటం లేదు. నగరపాలకసంఘంవారు శాశ్వతంగా దీన్ని మాస్వాధీనం చెయ్యాల్నని కోరుతున్నాము.

మా ఆహ్వానాన్ని అంగీకరించి నేటిసభకు అగ్రాసనాధిపత్యం వహించిన శ్రీమతి - బాలమ్మాళ్ గారికి హృదయపూర్వకంగా కృతజ్ఞతాభినందనాలు సమర్పిస్తున్నాము.

# వార్షిక నివేదిక

(శ్రీమతి-పర్వతవర్ధని)

సోదరీమణీ, బాలమ్మాళ్‌గారూ, సోదరసోదరీమణులారా,—

ఆంధ్రమహిళాసభాపక్షమున జరుగుచున్న మా నర్సరీ ప్రాథమిక పాఠశాలాబాలల తలిదండ్రుల వార్షికోత్సవసందర్భాన్ని పురస్కరించికొని మీకందరికీ సుస్వాగతమిచ్చుటలో నాకు అత్యంతానందము కలుగుచున్నది.

నర్సరీతరగతి, ప్రాథమికతరగతి యీరెండును మంచి అభివృద్ధిలో ఉన్నవి. ప్రాథమికపాఠశాలలో ప్రకృతం 41 మంది చదువుకొనుచున్నారు. అందు 20 మంది బాలురు; తక్కినవారు బాలికలు. నర్సరీసెక్షనులో 6 ఏండ్లకు మించని బాలబాలికలు ఉన్నారు. వారందరు కాయకష్టంచేసే తల్లులు గలవారు. ఒక 'ఆయా' (సంరక్షకురాలు) ఆబిడ్డలను జాగ్రత్తగా చూచుకుంటుంది. ఒక కిండర్‌గార్టన్ (వస్తురూప ప్రత్యక్షబోధన) (Kinder garten) తరిబీతు నొందిన ఉపాధ్యాయిని వారికి విద్యాబోధన చేయటంమాత్రమే కాక వారితో కలిసి క్రీడలలో కూడ పాల్గొంటుంది. ఎలిమెంటరీస్కూలుసెక్షను (ప్రాథమికపాఠశాలా) తరగతులు 1959 సం॥న ప్రారంభమయినవి. ఈ సం॥రమే ఆబడిని ప్రభుత్వం అంగీకరించినది. అందు మొదటితరగతిలో 24 మంది—రెండవదానిలో 10 మంది, మూడవదానిలో తక్కినవారు చదువుతున్నారు. ట్రెయినింగుఅయిన ఉపాధ్యాయినులు ఈపిల్లలవిషయంలో శ్రద్ధవహించి చూచుకొంటున్నారు. వారికి వారిమాతృభాషలయిన తెలుగు—అరవములలో విద్యాబోధన జరుగుయేర్పాట్లు గలవు. ఈ నాగేశ్వర శిశు విహారానికి అయ్యే నెలవారీఖర్చు దాదాపు రు.500 లు ఆంధ్రమహిళాసభ భరిస్తున్నది. కొంతవరకు డబ్బు చెల్లించే శక్తిగల తల్లిదండ్రులవల్ల నామకార్థపు సుంకం తప్ప ఇంతమొత్తం పిల్లలపోషణకు, విద్యకు చెల్లించవలెనని మేము నిర్బంధంగా వసూలుచేయము. మేము ప్రతిసంవత్సరం ఇంచు మించుగా ఇందుకై రు.6000లు ఖర్చుచేస్తున్నాము. కాని, మదరాసుప్రభుత్వం మాకు ఇచ్చే గ్రాంటుమొత్తం రు.1,200లుమాత్రమే. ఈచిరుతలసంస్థకు మన మహానాయకుడైన— కీ॥ శే॥ దేశోద్ధారక శ్రీకాశీనాథుని నాగేశ్వరరావుగారి జ్ఞాపకార్థం—వారిపేరే పెట్టబడినది. ఆయన మనదేశానికి చేసిన సేవ నిరుపమానము. స్వాతంత్ర్యపుపోరాటంలో ఆయన జంకుగొంకులు లేకుండా ముందు దూకేవాడు. మదరాసునగరానికి ఆయన ఎంతో త్యాగబుద్ధితో మహత్తరోపకారాలు చేశాడు. ఈచిన్నవిద్యాసంస్థ శ్రీదేశోద్ధారకునీ కీర్తిప్రతిష్ఠలకు అనుగుణంగా నానాటికి పెంపొందే గొప్ప జ్ఞాపకచిహ్నంగా నిలువగలదని విశ్వసిస్తున్నాము. దేశోద్ధారకుని కుమారీరత్నం అయిన శ్రీమతి కామాక్షమ్మగారు సభకు యావజ్జీవ సభ్యురాలై, మాకెంతయో తోడ్పడుచున్నందులకు ఆమెకు మా కృతజ్ఞతాభినందనములు చెల్లిస్తున్నాము. ఆమె అనుగ్రహించి ఇచ్చిన నివేశనంలోనే మేము 'శిశువిహార' భవనమును నిర్మించినాము. అంతేకాక, ఆసాధ్వీమతల్లి రు.5000లు భవననిర్మాణానికి సమర్పించటం ముదావహం. ఈమొత్తంతోకూడ, సభామూలధనం నుండి కొంతవఱకును, కేంద్రసంఘసంక్షేమసమితికి సంబంధించిన ద్రవ్యంనుండి కొంతవరకును, విహారసదనం కట్టి పూర్తిచేయటానికి ఉపకరించింది.

దినక్రమేణా, ఈ 'నాగేశ్వరశిశువిహార్' ప్రసిద్ధికి వస్తున్నది. కనుక, మేమింకా వచ్చిచేరే పిల్లలకు వసతులు ఎక్కువచేయాలి. పసివాళ్లకు ఇంగ్లీషులోనే బోధన జరపటానికి నవీనపద్ధతులతో ఒకతరగతి ప్రారంభించాల్నని ఉద్దేశించి, అమృతాంజనం లిమిటెడ్ కంపెనీవారిని ఇప్పుడుండే మందిరం మొదటిఅంతస్తుమీద మరొకఅంతస్తు నిర్మించుటకు తగులుబడి అయ్యేఖర్చులను భరించటానకై అభ్యర్థించినాము. వారు దయతో అందులకు సమ్మతించి వ్యయమయ్యే ద్రవ్యంలో కొంతభాగంగా రు.5000లు అనుగ్రహించినారు. ఈసందర్భంలో సభాపక్షాన అమృతాంజనం లిమిటెడ్ కంపెనీవారికి కృతజ్ఞతాభివందనాలు చెల్లిస్తున్నాము. వారికిని, ఈనాటిసభను అలంకరించిన పిల్లల తలిదండ్రులకును, పౌరసోదరులకును ఈ 'నాగేశ్వరశిశువిహార్' మనదేశంలోని బిడ్డల విద్యాభ్యాసాని కొకఆదర్శ సంస్థగా ఉండటానికై మా ఆంధ్రమహిళాసభ సర్వవిధాలా పాటుపడగలదని దృఢంగా చెప్పగలము.

(ఆంధ్రమహిళాసభ సంయుక్తకార్యదర్శిని, శ్రీమతి పర్వతవర్ధనిగారిచే సభలో చదువబడిన నివేదిక.)

# మహిళల వృత్తి విద్యాభ్యాసములు: ఉద్యోగములు

శ్రీమతి - దుర్గాబాయి దేశముఖ్

స్త్రీల జాతీయ విద్యాసంఘాధ్యక్షురాలు
(ఐక్యభారత విద్యా మంత్రివర్గం)

మహిళల వృత్తులకు సంబంధించినట్టియు, వుద్యోగములకు సంబంధించినట్టియు (తరిబీతు) అభ్యాసాన్ని గూర్చియు ప్రస్తావనకు వచ్చినప్పుడు, వెంటనే మనమనస్సుకు తోచుప్రశ్న— 'వారికట్టి తరిబీతు పొందునంత, అవకాశము ఎక్కడగలదు?' అని. స్త్రీలు కేవలము సంసారము చక్కదిద్దుకొనుటకును, బిడ్డలను పెంచుకొనుటకును మాత్రమే యిష్టపడువారనీ, పురుషులు తమ భార్యలను, కుటుంబములను పోషించుటకు చాలినంత, డబ్బు సంపాదించగలిగేవారనీ, మనలో ఒక అపోహ ప్రబలిపోయినది.

మన భారతదేశంలో ఇప్పుడిప్పుడు ఇతర ప్రదేశాల్లోమోస్తరే నానాటికి స్త్రీలు ఉద్యోగాలకై ప్రాకులాడటం అంతకంతకు పెంపొందుతున్నది. వారు తమ సంసారాలను చక్కబెట్టుకొనేవారుమాత్రమే కారు; వేతనాలు సంపాదించగలవారుకూడా. —ఈనాడు దేశంలో సాంఘిక ఆర్థిక పరిస్థితుల్లో ఎప్పటికప్పుడు తటస్థించే మార్పులమీద ఆధారపడిన అనేక పరిస్థితులే ఇందుకు కారణం. దీనికితోడు, విద్యావ్యాప్తితో బాటు అభివృద్ధి చెందిన వస్తుతత్వ పరిజ్ఞానము సాంకేతిక విద్యాప్రావీణ్యము కనీసపు జీవితప్రమాణాన్ని (విలువను) హెచ్చించినది. నిత్యజీవితాలకు మిక్కిలి ఆవశ్యకములయిన వస్తువుల ధరలుకూడ భరించుటకు వీలులేనంతగా పెరిగిపోయినవి.

ప్లానింగుకమీషను అన్నివిషయాలను చక్కగా పరామర్శించి, మూడవ పంచవర్ష ప్రణాళిక ముగిసేలోపల 3 లక్షలమందికి పైగా ఉపాధ్యాయినులును, 10,000మంది డాక్టరులును (వైద్యురాండ్రును,) 36,000మంది నర్సులును, 81,5000 మంది మంత్రసానులును, దాదాపు 4000 (కాంపౌండర్లును) మందులు కలిపి యియ్యదగువార్లును, 1.5లక్షలమంది తరిబీతు నొందిన సంఘసంక్షేమ సేవికలును, 1.5లక్షలమంది తరిబీతయిన చిన్న చేతిపనులు చేయువారలును- ఎన్నియో దేశాభివృద్ధికర కార్యాలకు (ప్రాజెక్టులకు) కావలసియున్నారని అంచనా వేసినారు.

అత్యావశ్యకంగా కావలసినవారికంటె, స్త్రీలను ఆ యా శాఖలకు ఉపయోగపడునట్లు తరిబీతు చేయుటకును, వృత్తులు కల్పించుటకును వసతులు చాలినంతగా లేవు. అల్లిక, నేత, బుటేదారి, ఈలాటివి వృత్తులకుపయోగించువానిలో ఒక భాగమునకు సంబంధించినవిగా ఎంచి, అందు తరిబీతుచేయుటకు కార్యక్రమం ఏర్పఱచుటతో, స్త్రీల నిరుద్యోగసమస్య తీరునద్దికాదు. స్త్రీలవృత్తులకు ఉద్యోగాలకు అనేక రంగాలలో తగిన అవకాశాలు కలిగించుచు, తయారుచేయటానికి అనుకూలంగా పరిశ్రమ బోధన కేంద్రాలను, బోధనాభ్యాసవస్తూత్పత్తిశాలలను, సాంకేతిక విద్యాబోధన భవనాలను, తదితరాభ్యాస కళామందిరాలను తగినట్లు తమపథకాలలో చేర్చి, ఆరీతిగా చేయటానికి కమీషన్ ప్రభుత్వానికి సూచించింది.

ఈతరిబీతు పొందదగిన కేంద్రాలలో రోజంతా హాజరై నేర్చుకొనుటకే కాకుండా, కొంతకాలం మాత్రమే (కొన్నిగంటలు) హాజరై నేర్చుకొనేవారికిని తగిన కార్యక్రమాలు సమకూర్పబడినవి. నియమితకాలంలో మాత్రం హాజరై నేర్వదగిన వృత్తివిద్యాదులు చాల ముఖ్యమయినవి. ఏలయన, అందు అనేక తరగతులకు సంబంధించిన వృత్తులలో తరిబీతు నొందుటకు వీలు

గలదు. పరిశ్రమలవల్లనే జీవించే మధ్యతరగతి కుటుంబాలకు ఆదాయం ఎక్కువ చేయటానికి అది చాలా సహాయపడగలదు.

మంత్రిమండలులును, రాష్ట్రప్రభుత్వాలును ఉద్దేశించిన యీవృత్తివిద్యా బోధన కార్యక్రమాలు ఎంతవఱకు స్త్రీలకు లాభదాయకం అగునో చూడవలసియున్నది. స్త్రీల వృత్తి బోధనాభ్యాస కార్యక్రమాలలో కొన్నివృత్తుల వల్ల వారికి వెంటనే పనులు లభించేటట్లు ప్రణాళికలు సూచించటం లేదు. రోజంతాగానీ, రోజులో నియమితకాలంలో (Part—time) గానీ తరిబితు పొందే వృత్తులకు సాజాత్యం కనిపించటంలేదు. కనుక ఈ వృత్తిబోధనాభ్యాస వివిధత్వాల నన్నిటిని పరస్పరసంబంధం గలవానినిగా చేర్చేపథకం తయారైనప్పుడే విస్తారంగా తరిబీతయినవారికెల్ల పనులు లభించటం సంభవిస్తుంది.

ముఖ్యంగా ప్రాథమిక విద్యాశాలలలో వీలయినంతవఱకు ఉపాధ్యాయవృత్తిలో ఎక్కువగా మహిళలే నియమింపబడవలెనని ప్రభుత్వోద్దేశం. కాని, మద్రాసు, కేరళ రాష్ట్రాలు తప్ప, తక్కిన ప్రదేశాలలో, ఉపాధ్యాయినీపదవికి కనీసపు యోగ్యతమైన మెట్రిక్కు ప్యాసుచేసిన స్త్రీలు చాలినంతమంది దొరకటంలేదు. ఈరాష్ట్రాలు కేంద్ర సంఘసంక్షేమ సమితిచే రెండేండ్లక్రిందట సంకుచితం చేయబడిన పాఠ్యప్రణాళికవల్ల పొందదగిన ప్రయోజనాన్ని పూర్తిగా పొందవచ్చును. వయోధిక్యతగల అంగనలు, అట్టిపాఠ్యప్రణాళికలప్రకారం బోధించే తరగతులకు హాజరై విద్యాభ్యాసంచేసి, ప్రభుత్వంవారిచే ప్రత్యేకంగా జరుపబడు పరీక్షలకు కూర్చోవచ్చును. అలాంటి పాఠ్యక్రమశిక్షణనిచ్చే సంస్థలు 3000 నెలకొల్పబడినవి. వానిలో సగటున ఏడాదికి 7000 మంది స్త్రీలు శిక్షణను అందుచున్నారు. ఈమూడవ ప్రణాళికాకాలంలో ఇంకొక 5000 సంస్థలు ఏర్పడగలవు.

ఇక, పోతే, చేతిపనులను అభివృద్ధిచేసే పథకాలను కొనసాగించటానికి అర్హులయినవారినిగా తయారుచేయటానికి వృత్తివిద్యలను నేర్పే శాలలను ఇంతవరకు 150 వరకు స్థాపించి వేలకొలది మందిని చేతిపనులలో తరిబీతు చేయుచున్నారు. 1961–'66 లలోఇంకను 250 వఱకు అట్టిఅభ్యాసవిద్యాశాలలను పెంచి దాదాపు 2లక్షలమందిని పరిశ్రమలమంత్రివర్గం నిర్మించే జాతీయాభివృద్ధి పథకాల పరిశ్రమలలో ప్రవీణులను చేయటానికి ప్రయత్నిస్తున్నారు. కాని వారికి పనులు దొరకటం మాత్రం అంతసులభసాధ్యం కానట్లు కనిపిస్తున్నది. అందుకు కారణం, వారివృత్తి వారున్నప్రాంతాలకు అవసరమైనవేవో, వానిని అనుసరించి వారు మలుచుకొనే శక్తిలేనివారుగానైనా ఉండవలెను; లేదా, ఏది అవసరమో దానిమీదనే తమదృష్టిని మళ్లించి, ఆపరిసరాలకు కావలసినవానికంటె అధికంగా సరఫరా, చేసేవారుగానైనా ఉండవలెను.

సాధారణంగా ఆ యా పరిశ్రమశాలలలో ఇచ్చే తరిబీతులు ఆ యా ప్రాంతాల అవసరాలను అనుసరించినవి కావు. ఆ యా స్త్రీలు తరిబీతయిన వాటికి తగిన(ఉద్యోగాలు) వృత్తులు జీవనార్థము వారి కందుబాటులో దొరకనిస్థలాల్లో వారుండటంవల్ల—వారభివృద్ధికి రాలేకున్నారు. కాన, వృత్తివిద్యాశాలలలో బోధనాభ్యాసమునకు వచ్చే వనితలు చాలావరకు తక్కువగానే వున్నారు. స్త్రీజాతీయవిద్యాసభ (National Council) వారిసిఫార్సు ననుసరించి పరిశ్రమల మంత్రివర్గానికి—మూడవప్రణాళిలో 1000 అభ్యాసకేంద్రాలు స్థాపింప నిశ్చయమయినది. అందులో 25 కేంద్రాలలో స్త్రీలకు వృత్తులు సులభంగా లభించే చేతిపనులు విరామకాలాల్లో నేర్చుకోవటానికి సదుపాయాలు కల్పించటానికి తీర్మానమయింది.

సాంకేతిక విద్యాబోధనములు:— మనదే

శంలో 97 శిల్పవిద్యాశాలలు (Engineering Colleges), 197 సాంకేతిక విద్యాశాలలు ఉన్నవి. వానిలో సం॥ 1కి 30,000 విద్యార్థులు చేర్పబడుతున్నారు. అందు స్త్రీలకు పురుషులకుకూడా సమానంగా విద్య నేర్పబడుచున్నది. అయితే, వారిలో స్త్రీలసంఖ్య చాలతక్కువ. కన్యలలో పెక్కురు మాధ్యమిక—ఉన్నతపాఠశాలవిద్యలతో తమచదువు చాలించుచున్నారు. ఇలాటివారు సంఘంలో తగినవృత్తిని అవలంబించి ఆదాయం తెచ్చేవారు కావటానికి ఉపయుక్తమయిన పనులలో తరిబీతుపొందవలెను. అందుచే స్త్రీజాతీయవిద్యాసలహాసంఘం-విరామకాలపు సాంకేతిక విద్యాపద్ధతులప్రకారం కన్యలకు అనుకూలించేవానిలో తరిబీతు చేయవలెను. ప్రతిరాష్ట్రింలోను అందుకై కొన్ని పరిశ్రమలసాంకేతికవిద్యాశాలలు నెలకొల్పబడవలెనని ప్రభుత్వానికి సిపార్సుచేసినది. దానికి సంబంధించిన మంత్రివర్గం రాష్ట్రప్రభుత్వాలతోనైనా, స్వచ్ఛందంగా పనిచేసే ప్రత్యేకసంస్థలతోనైనా, సహకరిస్తూ, ప్రతిరాష్ట్రింలోను స్త్రీలకై చిన్నచిన్న సాంకేతిక విద్యాబోధనాభ్యాసశాలలను, పలురకాల పరిశ్రమ బోధనాభ్యాస మందిరాలను ఒక్కొక్కరాష్ట్రింలో తుదకొకటి రెంటినైనా స్థాపించ నిశ్చయించింది. ఈవిద్యాసంస్థలు స్వయంగా సర్వసంపూర్ణలయిన మూడువిధాలతిరుగుళ్లు(Self Contained Cycles) కలిగివుంటుంది. ప్రాథమిక, ద్వితీయ, తృతీయ—విభాగాలతో విరామకాల తరిబీతుకార్యక్రమాలను అవి నడుపగలవు. ఇందులో ప్రాథమిక ద్వితీయ విభాగాల్లో 11ఏండ్ల యీడుదాటిన బాలికలకు రెండురకాలయిన తరిబీతు ఇవ్వబడుతుంది. వారికి సామాన్యవిద్య, విరామకాలవిద్యగాని- లేదా— సాంకేతికవిద్యకాని నేర్పబడుతుంది. ఈవిద్యలలో—శిల్పాది కళలు, వాణిజ్యపద్ధతి, చేతిపనులవిధానం, ఆహారవృత్తివిద్యాభ్యాసం, తేలికయిన శిల్పపుపని- మున్నగునవి చేరుతున్నవి. సామాన్యంగా నేర్చే ఉన్నతవిద్యలకును పలువిధాలుగా వుండే అనేకకళలకును—పైచెప్పిన వృత్తివిద్యలు ఏమాత్రం తీసిపోయినవికావు.

తృతీయపరివర్తన విభాగకాలంలోని సాంకేతిక విద్యాభ్యాసం మెట్రిక్యులేషన్ పరీక్షలో నెగ్గి 17ఏండ్ల ప్రాయం దాటిన బాలికలకు నేర్పబడుతుంది. అందులో విద్యుత్ప్రసారపద్ధతి (Electronic) ఔషధయోగము (Pharmacy) ఉడుపులతయారీ సంస్థానిర్వహణము చేరుతుంది. ఇట్టి వివిధ సాంకేతికకళాభ్యాసభవనాలు మూడవప్రణాళికప్రకారం మూడుకోట్ల రూపాయలతో 27 ఏర్పడగలవు. అందు ఒక్కొక్క దానిలో 270 మంది బాలికలను చేర్చటానికి అనుకూలాలు ఉంటవి. ఈలాటి బోధనాభ్యాస కేంద్రాల ఉపయోగం అనునది వానితో ప్రణాళికాంశాలు జతచేసి తరిబీతు పొందినవారికి మంచిఉద్యోగాలు లభించినప్పుడుగాని తెలియదు. సంఘసంక్షేమసమితి అలాటి సాంఘికార్థిక పరిస్థితులకు అనుగుణమయిన ప్రణాళికను చేకొని దానిసాఫల్యానికి పూర్తిగా పనిచేస్తుంది. తరిబీతునొందిన మహిళకు గొప్పఉత్పత్తులకై ఉపయోగపడు చిన్నచిన్న పనులకు లేదా స్వల్పపరిశ్రమలకు ఆధారాలయిన ఉత్పత్తి కేంద్రాలలోను ఉద్యోగాలు జీవనవృత్తులు లభించే అవకాశాలు విస్తారంగా ఉన్నవి.

పథకాలను నిర్మించే సందర్భంలో ఇంకొక ముఖ్యవిషయాన్ని గూడ గుర్తింపదగును. అనేక పారిశ్రామిక సాంకేతికరంగాల్లో తరిబీతుపొందిన వనితలు అంతకంతకూ అసంఖ్యాకంగా అవసరమవుతున్నారని ప్రకృతము ఉన్న స్త్రీల అల్పసంఖ్య రుజువుచేస్తున్నది. సాంఘికంగా ఏర్పడిన హెచ్చుతగ్గులను పురస్కరించుకొని చూచినా, చక్కని విద్యాభ్యాసానికి తగిన అనుకూలాలు కొరవడిన విషయాన్ని చూచినా పథకాలలోని కార్యాలు మహోన్నతస్థితిలో పెట్టటానికి నాయ

కత్వం వహించే సంస్థాపకులుగాని, వాని నడిపే సమర్థులుగాని చక్కని శిక్షణపొందిన స్త్రీలు చాల తక్కువగా ఉన్నారు. స్త్రీజాతీయవిద్యాసంఘం నియమించిన (కమిటీ) విచారణసమితి, నైపుణ్యాం గల నాయకత్వాన్ని వహించదగిన స్త్రీలకు మంచి శిక్షణను ఇయ్యటానికయి కొన్ని జాతీయబోధన సంస్థలను నెలకొల్పవలెనని సలహా యిచ్చింది. మొదటిశిక్షణా కేంద్రం 75 మంది పట్టభద్రలైన స్త్రీలకు అన్నిటినీ పరామర్శిస్తూ, తమక్రింద ఉద్యోగిస్తులైనవారిని తనిఖీచేస్తూ- సరియైన మార్గంలో కార్యాలను నెరవేర్చగలిగేటట్లు అభ్యాసం ఇస్తుంది. అలాటి కేంద్రాలు ప్రభుత్వంవారు స్థాపించినవికాని లేక ప్రత్యేక సంస్థలు నెలకొల్పినవిగాని-1962సం॥ నుండి పనిచేయటానికి ప్రారంభించగలదు.

---

# ఆదర్శజీవి: విమలాశర్మ

## శ్రీమతి గుమ్మిడిదల వెంకుబాయమ్మ

అమ్మగారు పూజలో కుర్చున్నారని నౌఖరుచెప్పగా నేను ఆశ్చర్యపోయాను. ఆమె మధ్యప్రదేశ విద్యామంత్రి భార్య; చదువుకుని డిగ్రీపొందిన ఆదర్శస్త్రీ, గొప్పఇంటి బిడ్డ, సమాజకళ్యాణసలహాబోర్డుకి అధ్యక్షురాలు. ఆమె పూజకూడా చేస్తుందా! ఆమె నిత్యకార్యక్రమాన్నిగురించి తెలుసుకోవాలని కుతూహలం కలిగింది.

మరొకసారి శ్రీమతి విమలాశర్మగారిని చూచుటకు వెళ్లినప్పుడు, 'ఆమెనుగురించి తెలుసుకోవాలని' వుంది అని అడిగాను. ఆమె ఆలోచనలో పడింది. ఆమె మిత భాషి. కాబట్టి తనయొక్క భావప్రకటననుండి తప్పించుకొనునది. నాఉద్దేశ్యము ఆమెకు తెలుపగా అంగీకరించింది.

నాకు చిన్నప్పటినుండి తల్లిప్రేమ తెలియక నా జీవితంలో మాతృభావము తెలుసుకోవలెనను ఆటుచన కలిగింది. శ్రీమతి శర్మవలన తెలుసుకున్నటువంటి ఆమెయొక్క దైనందిన (నిత్య) కార్యక్రమాన్ని గ్రహించే పాఠకులు ఆమెకు ఆదర్శులు కాగలరు.

ఈసందర్భనలో శ్రీమతి శర్మ తనపూజకు సంబంధించిన విషయములు వివరముగా చెప్పారు. పూజాజపములు, రహస్యమైనవి. రహస్యవిశేషములు తెలియపరచటమే ఇందులో విశేషము. ఆమెస్వాభావికముగా సరసమైన ప్రేమస్వభావురాలు.

శ్రీమతి శర్మ పూర్వాచారపరాయణ, వైష్ణవమర్యాదను అనుసరించును. ఆమె ఉదయం 6 గంటలకు లేచును. రాత్రి 1. 1.30 గంటలు విశ్రాంతి పొందును. ఎక్కువసమయం సేవలోనే గడచిపోవును. పరిశ్రమ, సేవయే ఆమెయొక్క జీవితాదర్శమై యున్నది. ఆమె గొప్పఇంటి విద్యార్థినిగా వుండి చూపిన ఆదర్శములు ఇప్పటి విద్యార్థినులు అనుసరించతగినని.

ఆమె తనగది స్వయముగ తుడుచుకొనెడిది. తనపక్క తానే పరుచుకొనునెడిది. తన బట్టలు తానే ఉతుకుకొనెడిది. ఇప్పుడు ఆమె ఐశ్వర్యవంతురాలుగ గౌరవనీయమైన గొప్పహోదాలో వున్నప్పటికీకూడా ఆమెలో సేవా, శ్రమలు చలించలేదు. ఆమె నేటికి కూడా తనబట్టలు తానే ఉతుకుకొనును. తనగది స్వయముగ తుడుచుకొనును. నౌఖర్లు ఏపనినైన చేయుటకు సంకోచించిన ఆపని తానే చేయును. తనపే కాకుండా తనభర్తబట్టలుకూడా తానే కుట్టును. అనాగరికులైన పల్లెటూరిస్త్రీలు తప్పించుకొని తిరిగేపనులు కూడా చేయుటకు ఆమె సంకోచించదు. పోయినసంవత్సరమువరకు తానే పిండివిసరుకొనెడిది. ఈసంవత్సరం ఒకపనిమనిషి, స్నేహయుక్తమైన బలవంతం ఈశ్రమనుతప్పించినది.

శ్రీమతిశర్మ, గృహకృత్యములలో చేయలేనిపనిగాని, చేయుటలో సంకోచనీయమైన పనికాని, లేదని నవ్వుతూ నాతో చెప్పిరి.

ఉదయం, భోజనములఏర్పాట్లు అయినతరువాత తన బిడ్డలను పాఠశాలకు పంపును. వెంటనే తనపూజకు వేళ అవును. ఆమె సాధారణముగ 11 గంటలకు పూజకు కూర్చుండును. మంగళవారము, శనివారము పూజాసమయములలో సుందరాకాండ పారాయణచేయును. నిత్యము బాలకాండలో 251 శ్లోకము "కుఅరి, మనోహరవిజయ బడికీరతి అతికమనీయ"... నుండి ధనుషభంగ యొక్క 265 వశ్లోకము "గౌతమతియ, గతి సురతికతి, నహిపరసతి, పగపాని...." వరకు పారాయణ చేయును. దుర్గానవమిరోజున నవాహ్న (నవదినపారాయణ) పఠించును. నిత్యపూజ పూర్తికాగానే హారతి ఇచ్చును.

సాయంత్రం బాలురతోకూడా ఖబుర్లుచెబుతూ, కలిసిమెలిసి తిరుగుట, ఆమెయొక్క దైనందిన కార్యక్రమములలో ఒకటి. ఆసమయంలో బిడ్డలు తమతల్లియొక్క స్నేహవాత్సల్యఆనందములకు పాత్రలగుదురు. శ్రీమతి శర్మ గారికి ఇద్దరు కొమార్తెలు ఒకకొడుకు గలరు. వారిని చక్కదిద్దుటలో ఎక్కువశ్రద్ధ తీసుకొనును. వారి ఆహారనిద్రలు, ఆటపాటలు మొదలగు సమస్తకార్యకలాపాలలో శ్రద్ధతీసుకొనుట తనముఖ్యకర్తవ్యం అని తలచును. ఆదర్శదంపతులకు నాగరికతతో కూడిన బిడ్డలే జన్మింతురు. వీరు రాత్రి నిద్రించుటకు పూర్వము భాగవతములోని రెండుఅధ్యాయములు తమతల్లివలన వినుచుందురనుటలో ఆశ్చర్యమేముంది? శ్రీమతిశర్మ నియమానుసారముగ భక్తిశ్రద్ధలతో పూజ పూర్తిచేసుకొనును. తన పవిత్రసంతానమును ఆదర్శమహాపురుషుల ననుసరించుచు వారివలె తయారగుటకు ప్రోత్సహించును.

ఆమె ఒకఆదర్శపతివ్రతామహిళ అనికూడా మనము మరచిపోకూడదు. పతిసేవలో ఏవిధముగాను లోటు రానీయదు. ఆమె ఇప్పటిస్త్రీ అధికారిణుల ఆందోళనలతో ఏకీభవించననిచెప్పిరి. సమాజమునకు వారిని భరించునంతటి సమర్థతలేదు. కాబట్టి నేటికికూడా స్త్రీలకొఱకు పతిసేవయే చిక్కులేనిమార్గమని తెలుపును. పతిభక్తి చాలాగొప్పది. అయితే భర్తను తనకనుకూలుడుగ చేసుకొనవచ్చును, కాని ఏపరిస్థితిలోనూ కూడ పతిసేవలో విముఖత చూపకూడదు. పతిసేవలోనే స్త్రీ ఆత్మసంతోషమును పొందును. తన వాతావరణమువరకు ఈపతివ్రతాసిద్ధాంతము శాంతిని కలుగచేయును. పతితనకు అనుకూలుడైయుండును. కుటుంబములో శాంతిభద్రతలు ఏర్పడును. తనకు సమాజమునకుకూడ కళ్యాణము చేకూరును. సేవామార్గములోనే అధికారముకూడ సులభముగ పొందవచ్చును. ఇదియే మహిళకు ఇచ్చు సందేశము అనిచెప్పిరి.

నేను క్షమించమని వినయపూర్వకముగ నడుగు ప్రశ్నలకు సంతోషముగ తనబిడ్డలకు తల్లిచెప్పుమాదిరి సమాధానమిచ్చుచుండెను. నేను తమజీవితసఫలతలో నుండు రహస్యమేమి అని అడిగితిని, అప్పుడు ఆమె నాకేమి తెలియదు. ఇందులో రహస్యమేముంది? అంతా భగవంతుని దయ యని సమాధానమిచ్చెను. తమ భవిష్యత్తు తను చేతిలో వుంటే మీరు ఏమి అవవలెనని కోరుచుంటిరి?అని అడిగితిని. ఆమె నవ్వుతూ నేను ప్రొఫెసరుని అవుతాను అనిచెప్పిరి. అప్పుడు నేను 24గంటలకుబదులు 26 గంటలకాలముంటే మిగతకాలములో ఏమిచేయుదురని అడిగాను. నేను కుట్టుపని చేస్తాను, లేకపోతే వ్రాస్తాను. నాకు రెండూ ఇష్టమే కాని నాకు వ్రాయుటలోనే ఎక్కువ ఆలోచన పోతుంది అనిచెప్పిరి.

మీరు ఎల్లప్పుడు ఆలోచించేది పతి, బిడ్డలు, తల్లిదండ్రులనుగురించి. ఎందుకంటే నేను నాతల్లిదండ్రులకు పెద్దకూతురను అని జవాబుచెప్పిరి. ఆమె ఇచ్చిన జవాబులో భారత స్త్రీకి వుండవలసిన గొప్ప జవాబుదారీ ఆదర్శము రెండువంశములు తరింపచేయునవిగా చెప్పబడినవి. నేను వినయపూర్వకనమస్కారముచేసి సెలవు తీసుకుంటిని.

ఎన్నియో గొప్పకుటుంబములవారు చిన్న ఇంటివాళ్లు వున్నారు. ఎక్కడైనా శ్రీమతి విమలాశర్మమాదిరి ఆదర్శస్త్రీని చూచారా?

---

ఒక మహోద్యమ దివ్యపీఠముకడ నిన్ను నీవే ఉత్సాహముతో సమర్పించుకొనుము ఉత్సాహమే ఆత్మకు జీవము.

(వెండల్ ఫిలిప్సు.)

# ధన్య జీవి

## పండిత శ్రీ నారునాగనార్య

కన్నబిడ్డపయిం గూర్మి. కన్నుఁదెఱవ.
మానరతుకు. ప్రాణముల్ - మల్లడింప.
బయలు మెఱయఁగ వెరవు గన్పడక ముందు
వెనుక కల్లాడి కాఁపుగు-బ్బెత కృశించె.
అప్పు డక్కసు దిగద్రోసి. తప్పుగాచి.
కార్యసాధనకై శాంతికామునట్లు.
చెంతపొంతలఁగూడి యో-వింతవాఁడ,
కొంతనిలుమయ్య, యీపని. కూడదయ్య.
నీకుఁదోఁబుట్టువులు లేరె! నిట్టనిలిచి.
దారిలో దాగు నారులఁ జీరి మాన
భంగమొనరింప నీకేల భ్రాంతికలిగె?
నీతి నీజాతిలో బుట్ట-నేరదేమొ?
పొమ్ము నీదారిబట్టి యీపొగరుబోతు.
తనము మాజాతిపై చెల్ల-దని యెఱింగి
బ్రదుకుమా! యటు లేదేని- యెదురుతిరిగి
పెద్దయధికారులకు, వినిపింతు ననిన,
ఉబికి కామము నిలువెల్ల. నుప్పతిల్లి
యొంటరిగ జేయిజిక్కన, యువిద జారు
పాటునకు మది రోషాగ్ని. ప్రజ్వరిల్ల,
ధూర్తసైనికు డపుడేమి, తోఁచకునికి
తానెవఁడు? జగమునఁ జేయఁదగిన కార్య
మెట్టిదని సభ్యతాస్థితి- యిట్టిదనుచు,
నెఱుఁగఁజాలక. యింగిత- మింతలేక,
యప్పరోపకృతింగూర్చి- దెప్పిపలికె
ఏమిరా! బుద్ధిలేక, మ,మ్మోవఁడవంచుఁ
దెలియకయె, మీఁదెఱుంగక. తీవరించి
యెగిరిపడెదవు, కార్చిచ్చు- నెదురు మిడత
వోలె బ్రదుకాసయున్న ని-క్లేల! చెపుమ!
తెల్లదొరనని నీవు గుర్తింపలేవా?
చేతనున్న తుపాకి వీ-క్షింపలేవా?
అరనిమునమంద నీచావు- నరయలేవా?
కల్లగాదిది నమ్ముమీ! నల్లవాఁడ!
బ్రదుకుపై నాస కలదేని- కొదుకుమాని.
చిలుకువదలించి యిచ్చోటు, వెలలిపొమ్ము
కాదుకూడదటంచు. మూర్ఖమ్ముఁజేయ,
తుణములో యమునింట విశ్రాంతియొదవు,
మాకథ యెఱుంగవో? రవిమండలంబె
యస్తమింపని సామ్రాజ్య- మధిగమించు
జాతిలోఁబుట్టి సైనిక-నీతి గఱపు.
తెంపరులఁ మేమెదిర్చినఁ దిరుగుఁగలదె?
అనిన "హంపన్న" లెక్క-చే-యక యెదుర్పఁ
గినుక పునుకంటఁ జెనకి యగ్గివలె మండి.
కామపరవశ చిత్తమ్ము- గలఁతఁ జెంది
పాశవిక జాతి గుణము స్వభావమగుట,
భుజమునందు తుపాకి గొబ్బునను దించి
నాళమున మును బొడిచిన-ఁ దాళఁజాలి
దుడ్డుకఱ్ఱను జేఁబూని- తొత్తుకొడుక.
తప్పుచేయుటగాక! పై-దంభమేల?
మేనిపై యాసయున్న ని-వ్వానితోడ
వాదులాడకు, చేతఁదు-పాకికలిగి
నంతమాత్రాన, నీకు ధాపోహమునఁగ,
నేను భరతవీరుఁడగానె, చెపుమ!
అని తటాలునఁ దలుపున కడ్డునిలిచి
నాస నూపిరి యాడుచున్నవఱకైన
నేను వెనుదీయనని క్రుధాగ్నిజ్వలనము,
వెలల హంపన్న చేకట్టె విసరికొట్టె,
ఏమి పోగాలమో? కాని. యింగిలీసు
దొరకుఁ బుట్టితినని దొడ్డదురుసుతనమొ?
యోర్పోకింతయె, లేక, యాయువక సైని
కుండు మిడిమేలమున జ్వలత్ క్రోధుఁడగుచు
వలపుదీపితన, మ్మనుభవ విదూర
ముగఁ బొనర్పుటకతన గెంపుగనుదోయి,
చంద్రనిప్పుక లురల నజ్ఞతను బొరల
మీఁదెఱుంగక నున్మత్తస్థాదియైన
అప్పు డాయింటి యందున్న. యతివమిన్న
తట్టుమిట్టాడు జీవితాధ్వమునఁ బొగిలి
గుండె లొటలొటమను జంకు.కొంకుతోడ,
నెట్లొ! కాలమ్ముఁ గడపె, దిక్కింతలేక!
వాడు పెనురక్కసుండు తుపాకిగుండు
"హంపన" యనంగ దండ్రియే యైనఁ జీడి
కఱ్ఱ యేమి యెదుర్కొనఁ గలదటంచు.
వలబడినపక్షివలెఁ గలవరము గొనియె,

చేయునదిలేదు పైన శిక్షించు త్రాత
కల్గ, డొకతెను జిక్కితి కానివేళ.
నైన వారికి నిది యెట్టులవగతంబు,
దేవుడే దిక్కటంచు బందివలె నుండె

ఇంతలోఁ బిడుగు పడ్డట్టు లెట్టయెదుర,
"గూళపాళెము హంపన్న గుండెమీద.
"ఫట్" అటంచును ప్రేలెఁ దుపాకి నకట!
తెల్లదొరజాతి నిర్దయ, తెలుపునట్లు.

అపుడ, స్మృతికేని సంసిద్ధమైన జోదు
పోలిక తుపాకిగుండుకుఁ బోటుకత్తి
నడ్డియుట నిష్ప్రయోజనమయ్యెఁ, భయద
వజ్రపాతముఁ జేయొద్దు వానిపోలె!

ప్రాణములు పోయి కూడ "హంపన్న"-శవము
కాఁపుచెలి యింటి ముంగిటఁ గాఁపుగాచె,
నమ్మపోళయు, మహితాశయ ముదాత్త
మగుట! ధీరులు వెనుకాడరనుట నిజము

వలపుకొసవెట్టి పిసరెత్తి. తెలివిదప్పి
కానిచేఁతలు జేసి వి ఖ్యాతిమాసి,
తుంటరీఁడగు తెలిదొర బంటుకొడుకు,
కన్నులరవిప్పి యెదుర లోకమ్ముఁగాంచి.

భారతులెఱుంగఁ దనకిఁక బ్రదుకులేదు.
ఉన్నతోద్యోగు లెఱిఁగిన యసురునిలువ
దనుచునూడనిబాడెఁ బ్రాణాశఁ దవిలి
భయము దోచినఁగామమ్ము, పర్వకున్నె ?

తెలివిలేక, మనస్సు స్వాధీనపడక.
కామమను గడ్డి మేసి నిక్కమ్ము మరచి.
యెదిరిసొత్తును గోరితి. నిప్పుడేమి
సేతు? పాపఫలమ్ము భుజింపవలసె!

"ఎవ్వఁడీగుట్టు రట్టొనరించునేమొ?
పిదప యెటులౌనొ? నాపాడుబ్రదుకు. దుదకు
జెఱచె నాయాభిజాత్య మీతెఱఁగిఁకేవి
"కాళ్ళకుఁజు బుద్ధిచెప్పుటె" కర్జమనుచు,

పొలకువ యెఱుంగ కచ్చోటు. వెలలిపాఱెఁ,
బ్రాణభీతి మనస్సులోఁ బర్వులెత్త
నందఱును జోదులే? కామమఱఁచి యేలు,
నొక్కనెఱజోదు కనఁబడఁ డుర్వి నరరె?

ఎదుటిశీలము వలపు గుర్తింపఁజాల
దుసురుపై యాన కామంపు ముసుఁగుఁద్రోయు,
దెల్లదొరబంటు దుష్కీర్తి దెసలనల్లె
"వీరహంపన్న" సత్కీర్తి విస్తరిల్లె

అల్లదే! త్యాగి "హంపన్న" దగు సమాధి.
పాఠకా! గుంతకలుదారి ప్రక్కఁ గలదు.
అరయుమొకసారి భక్తితో నంజలించి.
హైందవచరిత్ర నొకపుట యందు జదివిఁ

దేశసేవార్థమో? ధర్మదీక్షకొఱకొ!
జీవితము ధారవోయు, యశోవిశాలు
రైన త్యాగుల భజియించు టవసరంబు.
దేశమద్దాన సిరుల వర్ధిల్లుఁగాన!

## విజయవార్త

'ఆంధ్రమహిళాసభ' పారిశ్రామిక విద్యాలయమునుండి, 1961 సం॥రములో గవర్నమెంటు టెక్నికల్' పరీక్షలకు వెళ్ళి, అందీక్రిందివారు విజయంపొందినారు.

కుట్టుపనిలోయర్ పరీక్షలో నలుగురు

(1) యస్. లక్ష్మి (2) ఆర్. రుక్మిణి
(3) ఏ.మేరి (4) ఏ. ఆరోగ్యమేరి

కుట్టుపని హైయ్యర్ పరీక్షలో ఒక్కరు

(1) యస్. ఆంథోని అమ్మాళ్

ఎంబ్రాయిడరీ హయ్యరులో ఒకరు

# వార్తావళి

## క్యూబా

తిరుగుబాటుదారుల పోరాటాలు పూర్తిగా అణచివేసి— జయంపొందినట్లు ప్రధాని కాస్ట్రో ప్రకటించాడు. ప్రత్యక్షంగా కాస్ట్రో ప్రభుత్వాన్ని ప్రతిఘటించిన అమెరికా ప్రభుత్వం అపజయం పొందడాన్ని కెన్నడి అంగీకరించాడు. అమెరికా దౌర్జన్యాన్నిగూర్చి అది విప్లవకారులకు సహాయం చేయటాన్నిగూర్చి ఐక్యజాతీయసంఘం చర్చించింది. అమెరికా తనకార్యాన్ని సమర్థించుకోవలెనని ఆర్గనైజేషన్ ఆవ్ అమెరికన్ స్టేట్సు' (O.A.S) ను ఆశ్రయించటానికి చేసిన ప్రయత్నాలుకూడా విఫలమయినాయి. ప్రకృతంక్యూబాలో తాత్కాలికంగా ప్రశాంతస్థితి ఏర్పడింది. కాని తిరుగుబాటుదారులు మరలా ఇంతకంటె బలవత్తరంగా పోరాటాన్ని సాగించే సూచనలుమాత్రం అణగిందని చెప్పటానికి వీలులేదు.

## కాంగో

భారతదేశ సైన్యాలు చాలవరకు లియొపోల్డు విల్లా, కామినా ప్రదేశాలు చేరినాయి. కాని కటాంగా ప్రెసిడెంటు షాంబుల్ ఐక్యజాతీయసంఘ ప్రయత్నాలు భగ్నంచేసే ఉద్దేశంతో కామినాలో ఉన్న భారత సైన్యాలకు కావలసిన పదార్థాల సరఫరాలన్నీ ఆపివేయాల్నని ఉత్తర్వులు జారీచేశాడు. ఇది యిలా ఉండగా ప్రెసిడెంటు జోసవ్ కసవాబు తాను ఐక్యజాతీయసంఘంతో సహకరిస్తానని తెలిపాడు. ఈవిషయంలో జాతీయసంఘం, కాంగోనాయకవర్గం ఎలా నడుచుకుంటారనే విషయం ముందుముందుగాని తెలియదు. కాంగో ప్రభుత్వం షాంబులును అరెస్టుచేసినట్లు 27-4-61 నాటి వార్తలు తెలుపుతున్నాయి. అక్కడి జాతీయ మిలిటరీ వర్గం-కసవాబుతోసహా నాయకుల నందరిని ఇండ్లనుండి కదలరాదని డిఫెన్సను ఉత్తర్వులు చేసినట్లు 29-4-'61 న ప్రకటించబడ్డది.

## లావోస్

అనేక చిక్కులతో కూడిన లావోసుసమస్య ఒకవిధంగా తీరేసూచనలు కనిపిస్తున్నాయి. క్యూబా విషయంలో అమెరికా దుశ్చర్య అట్లుండగా, 1954 సం॥న జినీవాలో చేరిన సభలో రష్యా—బ్రిటిషురాజ్యాలు. సమ్మతించిన తీర్మానాలను అనుసరించి లావోస్‌లోని కలహాలను తక్షణం నిలిపివేయటానికి వెంటనే జినీవాలోగాని న్యూఢిల్లీలోగాని 15 రాష్ట్రాల ప్రతినిధులసభ భారతదేశనాయకత్వంక్రింద త్వరలో మేనెల సమావేశమయి సంధిసూత్రాలనుగూర్చి చర్చించగలదు.

## ప్రథమ గ్రహమండల యాత్రికుడు

యూరీ గేగరిన్ (Yuri Gagarin) అను రష్యాయువకుడు రాకెట్టున జయప్రదంగా గ్రహమండలాన్ని అందుకొని జయప్రదంగా సంచారంచేసి వచ్చినాడని రష్యాప్రజలు ప్రభుత్వం అత్యంతఉత్సాహంతో గర్వంతో ఉప్పొంగి అతనికి సుస్వాగతం ఇచ్చారు, అతడు అధిరోహించి వెళ్లిన రాకెట్టు దాదాపు 180 మైళ్లు అంతరాళానికి వెళ్లి మూడుపర్యాయాలు భూమిమీదికి చుట్టిచుట్టివచ్చి తుదకు స్వదేశాన్ని చేరింది.. గేగరిన్ రాకెట్టునుండి చిరునవ్వుతో దిగి వచ్చాడు. అక్కడి మిత్రులతో ఆకాశంనుండి భూచక్రవాళం చాలా సొగసుగా కనబడిందని, నక్షత్రాలు మనం భూమినుండి చూచే పరిమాణంకంటె చాలాపెద్దవిగా అగపడినవనీ భూప్రదేశమే ఒకచీకటి కోణంగా ఉండినదనీ చెప్పాడు, భావికాలంలో మానవుడు గ్రహమండల మధ్యమున సులభంగా రాకపోకలు సాగించటానికి ఇదే ప్రథమప్రయత్నంగా—నాందిగా ఊహించవచ్చును.

## సింహళం

తమిళసోదరులు ఎక్కువగా ఉండే సింహళదేశ రాష్ట్రాలలోని అరవలు, తమ భాషాప్రాధాన్యాన్ని ప్రభుత్వం గుర్తించాల్నని కొన్నిఏండ్లుగా ఆందోళన చేస్తున్నా, సింహళప్రభుత్వం ఎప్పటికప్పుడేదో సమాధానాలతో కాలయాపన చేస్తూవచ్చింది. ఇక తీవ్రచర్యలకు పూనుకుంటేగాని కాదని, అక్కడి అరవలందరు ఏకోన్ముఖంగా రెండు నెలలనుండి సత్యాగ్రహం జరుపుతున్నారు. అది అంతకంతతీవ్రరూపాన్ని ధరించడంతో శ్రీమతి భండార్కేనాయకే ప్రభుత్వం, నిర్బంధచర్యలకు పూనుకొనింది చాలమంది నాయకులు చెరసాలలో బంధింపబడ్డారు. అసమ్మతిని తెలిపే సత్యాగ్రహుల ప్రశాంతచర్యలను పోలీసు దౌర్జన్యాలతో ప్రభుత్వం ఎదుర్కొంటున్నది, ప్రకృతం సత్యాగ్రహుల ఉద్యమం విశ్వరూపం ధరించింది, ముందెలా సింహళప్రభుత్వం వారిని ప్రశాంతస్థితికి తెస్తుందో వేచి చూడాలి.

ప్రెసిడెంటు కెనెడిచే మనభారతదేశానికి అమెరికా సంయుక్తరాష్ట్రాల రాయబారిగా నియమింపబడిన ప్రొఫెసరు— జాన్ కెన్నెత్ గాల్బ్రెయిత్ ఈ 18—4—61

తారీఖున ఐక్యభారతాధ్యక్షుడు శ్రీరాజేంద్రప్రసాదుగారికి తన యోగ్యతాపత్రాలు సమర్పించాడు.

మూడవ పంచవర్ష ప్రణాళిక చిత్తుముసాయిదాలో విద్యాభివృద్ధికొఱకు 10,200 కోట్లుమాత్రమే సూచింపబడినది. కాని ప్రధాని శ్రీనెహ్రూసలహా ననుసరించి ప్లానింగుకమీషన్‌వారు ఆమొత్తాన్ని రు 10400 కోట్లకు తాము తయారుచేసిన మెమొరాండంలో పొడిగించారు.

మనదేశంలో వుత్పత్తిఅయ్యే చక్కెరలో మిగత ఇతరదేశాలకు ఎగుమతి చేయటానికి సిద్ధంగా వుందనీ, దానిమీది కంట్రోలుమాత్రం తొలగించటానికి వీలు లేదని ఆహారమంత్రి శ్రీపాటిలుగారు లోకసభలో చెప్పారు.

కేరళ రాష్ట్ర శాసనసభాధ్యక్షుడు శ్రీ కే. యం. సీతీసాహెబు(మస్లింలీగు)గారు గుండెజబ్బుతో 17-4-61 తారీఖున పరమపదించారు.

చింతచచ్చినా పులుసు చావదట. అలావుంది మన ఆంధ్రరాష్ట్రమంత్రివర్గ, యూనైటెడ్‌ఫ్రంటువర్గ వ్యవహారాలు. రాష్ట్రక్షేమం ఆలోచించకుండ, రాబోయే యెన్నికలకు ఏకోన్ముఖంగా ఐకమత్యంతో సిద్ధపడాల్నే యోచనలేకుండ— వ్యక్తిగతంగా ఉండే ఆవేశాలూ- కావేషాలు పెంచుకుంటూ, స్వల్పకాల మంత్రి పదవులకయి ఢిల్లీదాకా ప్రయాణాలు సాగించటం నాయకుల లక్షణం కాదని తెలుసుకొన్నప్రధాని 'కుక్కాన గుండ్రాయి తీసికుంటే సరి' అనే సామెతగా— మంత్రుల నియామకాలు నిలిపి— కాంగ్రెసుప్రతిష్ఠకయి, దాని విజయానికయి పాటుపడండోయ్ అని పంపివేశాడు. ఇటుపై మన రెండువర్గాల నాయకసోదరు లెలా నడుచుకుంటారో వేచిచూడాలి:

---

# శ్రీ వెంకటేశ్వరాయనమః

వేంకటేశ్వరా

రచన: వై. రాంబాబు

బాలుడ వేదవిద్యమది ప్రాపితమౌగతి పొందలేదు—నీ
చాలున నింక నేర్వనలె సర్వజగాధిప! శోకనందనం
చాలక! సర్వధర్మ గుణసాగర! తక్కరు జారసైక లీ
లాలసదార్ణ వోద్ధృత విలాస విహారివి వేంకటేశ్వరా!

హరివో! హరుడవొ? నామది
నెఱుగన్ జాలక హరిహరుడ వీవే యంచున్
నిరతమ్ము నిన్ను గొల్తును
పరమానందాతిరేక భావన తోడన్
కొండపై వసియించు కూర్మిదొర! నీకు
విన్పించునో లేదొ!? జాలిపిలుపద్ది
మెట్లెక్కి నినుజేర నెట్లౌను నాకు
చిన్న బాలుడ నేను చిరుత ప్రాయమ్ము

నీపాదాలచెంత నొక
పూవునై పడియుండ
జేయవోదేవా!
కుటిల మానవ లోక
వాసుగా నన్నేల
సృజియించినావు?

# గ్రంథసమీక్ష

సుభద్ర— కర్త: శ్రీ. సి. బి. అవధాని. కాకరపఱ్ఱు, పశ్చిమ గోదావరిజిల్లా; వెల 6 అణాలు. వలయువారు గ్రంథకర్త పేర వ్రాసికోవాలి

దాదాపు 44పుటలుగల యీగ్రంథంలోనికథ సరళమయిన వ్యావహారికభాషలో సాగిపోతూంటుంది. శ్రీ అవధానిగారి రచన సురసజనహృదయంగమయి కథ పూర్తిగా చదివేంతవరకు గ్రంథాన్ని క్రింద పెట్టనీదు. గయోపాఖ్యానం, కళాపూర్ణోదయం— మొదలగువాటి మోస్తరు ఈగ్రంథంలోని కథకూడ కల్పితమే. అయితే, ఔచిత్యంలేని వస్తువైవిధ్యాల్ని అనుసరించిన యీకథలో ఒకదానికొకటి సంబంధించని అంశాలు కొన్ని కనబడతాయి:—

1) ఎనిమిదిదినాలైనా తాతగారింకా నేలకూలలేదనీ. ఆయన అలా కూలితేనేతప్ప తమకు జయంకలుగదని పాండవులు, కలవరపడుతూంటే వారికి తగినసలహా యివ్వనికీబదులు శ్రీకృష్ణుడు అర్జునుడితో షికారెళ్లటం ఏమం అసమంజసంగా కనబడదు,

2) పోనీ, షికారువెళ్లినచోట అర్జునుణ్ణి— శయ్యానిర్మాణానికి శ్రీకృష్ణుడు పురికొల్పటం 'లంకణాలలో శోభనాలముచ్చట' వంటిది.

3) సంగ్రామమహోవత్సముద్రాన పూర్తిగ మునిగివున్న అర్జునుడి మనస్సు ప్రేయసిఅయిన సుభద్రమీదికి మళ్లడం రసాభాస మనిపిస్తుంది.

4) ఆంతరంగిక భక్తుడు, బావమరది అయిన అర్జునుణ్ణి శ్రీకృష్ణుడు మోసగింపబూనటం అందుకై సుభద్రవేషం ధరించటం ఎంతనైచ్యం. రసజ్ఞులకిది రామాయణంలో పిడుకలవేట్లాటవలె తోస్తుంది.

తాను మనసార ప్రేమించిన సుభద్రను కేవలం ఒకపతాకకై కొరడాతో కొట్టడం అర్జునుడివంటి ధీరోదాత్తనాయకుడికి తగదేమో। అలా చేసిన పాండవమధ్యముని పాశవత్వం సర్వధా గర్హ్యం.

మొత్తంమీద ఈ గ్రంథంలోని అనౌచిత్యాలు అలా వుండనిచ్చి— కథాధోరణి, శైలి, ఏపాఠకుణ్ణిఅయినా పరవశుణ్ణి, చేస్తుందనటంలో సందేహంలేదు.

శ్రీస్వామిమేలుకొలుపు; కర్త: శ్రీభరద్వాజ నామాంతరంగల శ్రీ— ఇ. జగన్నాథాచార్యులు, వెలతెలియదు. వలయువారు, అభ్యుదయకళాసమితి— అనంతపురం'— అని వ్రాసికోవాలి,

శ్రీవేంకటేశ్వర సుప్రభాత శ్లోకాలకు ఆంధ్రానువాదాలు ఎన్నో వెలిశాయి. అందులో శ్రీస్వామిమేలుకొలుపు' కూడా ఒకటి. అయితే, ఇది 'తూ—చ'— తప్పని తెలిగింపుకాదు. పైగా, పాదపూరణజీవాతువులయిన ఊతపదాలు, పడికట్టురాళ్లు పెక్కులున్నాయి. లక్షణవిరుద్ధ ప్రయోగాలుకూడా కనిపిస్తాయి.

(1) తరుణఘోష (తీవ్రఘోష' అని మూలం—

(2) 'కరయుగమ్ములు జోడించి శిరము మోడ్చి— శిరమును మోడ్చి'— అనాలి, అట్లన్నప్పుడు గణభంగం.

(3) 'నాణ్యమొప్ప'— 'నాణెమొప్ప'— అనాలి

(4) రజమును శిరముదాల్చి (రెండవదానివంటిదే)

(5) కనకకలశలు (ఇది పుంనపుంసకము) 'కనకకలశాలు'— అన్న సరిపోవును, గణభంగంకూడ ఉండదు.

(6) 'నినువిన' వేరుదైవంబు. 'నినువినా' అని దీర్ఘాంతం సాధువు

(7) 'సత్కృపపూరిత' — 'కృపాపూరిత' - అనాలి.

ఇలా దోషాలున్నా, భగవత్సుప్రభాతంగనుక, భక్తులకత్యంతోపయుక్తం. అనుదినం అరుణోదయకాలంలో పఠింపదగినవి కౌశిక.

స్వీకారము : క్రింది సినిమా మాసపత్రికలు మాకార్యాలయానికి చేరింది.

సినిమా రంగం—ఏప్రిల్ 1961—వెల 60 నయాపైసాలు,

రూపవాణి—ఏప్రిల్ 1961 వెల 50 నయాపైసాలు,

ఆధునిక కవుల చరిత్ర : కర్త శ్రీకోగంటి దుర్గామల్లికార్జునరావు, పామఱ్ఱు. వెల 75 నయాపైసాలు.

# 'ఆంధ్ర మహిళ'

(ఆంధ్ర మహిళా లోకాభ్యుదయ మాసపత్రిక)

వ్యవస్థాపకురాలు :
శ్రీమతి దుర్గాబాయిదేశ్‌ముఖ్.

విడి పత్రిక—37 నయాపైసాలు ప్రత్యేక వార్షిక సంచికతో కలిసి
సం॥ చందా - రూ. 6-00.

పంచాయతీ సంస్థలకు. సంక్షేమ సంఘాలకు, పౌరజన గ్రంథాలయాలకు
పాఠశాలా పుస్తక భాండాగారాలకు సగము చందా సం॥ రం॥ కి రూ. 3-00 లు.

## పత్రికా విక్రయసంస్థల యేజంట్లకు

1. 'ఆంధ్ర మహిళ' ఆరింటికంటె తక్కువ ప్రతులకు ఇచ్చే ఆర్డర్లు గమనింపబడవు.
2. పత్రికకు 1 కి 12 న. పైసాలు కమీషను ఇవ్వబడును. పోస్టేజి మేమే భరింతుము.
3. విక్రయంకాని సంచికలు వాపసు తీసికోబడవు.
4. ప్రతినెల "ఆంధ్ర మహిళ" ఎన్నిప్రతులు కావలెనో సూచిస్తూ. అసలుక్రయంలో కమీషను మొత్తం మినహాయించుకొని, తక్కిన మొత్తంతో వచ్చే ఆర్డర్లు అంగీకరింప బడును.
5. ప్రత్యేక వార్షిక సంచిక ప్రతి 1. కి రూ. 2 లు, అయినా, యేజంట్లకు రూ. 1. 50 కే, (అనగా 25. కమీషన్ మినహాయింపుతో) ఇవ్వబడుతుంది.

## ఆంధ్రమహిళ

ప్రకటన రేట్లు

సామాన్యమైన పుట 1 కి. రూ 60. లు,
అట్టకాగితం 2 వ పుట, 3. వ పుట (ఒకేరంగుతో) రూ 80 లు.
4. వ పుట (ఒకేరంగుతో) రూ 100 లు.

కొయ్య దిమ్మెలుగల బ్లాకులు అంగీకరించ బడును. ప్రకటనలు. బ్లాకులు పత్రిక వెలువడే తారీఖునకు 10 దినములు ముందే మాకు చేరాలి.

మేనేజరు,
ఆంధ్రమహిళ
7 ఎ. రోజరీచర్చిరోడ్డు.
మైలాపూరు—మద్రాసు 4.

Printed at Andhra Mahila Press, 7/A, Rosary Church Road, Published and owned by ... Secretary, Andhra Mahila Sabha.